# క్షేత్రయ్య పదముల త్రివేణి సంగమము

తెలుగు విశ్వవిద్యాలయమునకు
ఎం. ఎ. పట్టాకోసం సమర్పించిన
సిద్ధాంత వ్యాసము.


పరిశోధన
కీర్తి. సత్యవతి.

పర్యవేక్షణ
శ్రీ ఆచార్య యల్లా వెంకటేశ్వరరావు.
శ్రీ. యస్. కె. వెంకటాచారి.



తెలుగు విశ్వవిద్యాలయము
లలిత కళా పీఠము
నాంపల్లి, హైదరాబాదు.

# పఠించిన గ్రంథములు

1. భరత కళాప్రపూర్ణ డాక్టర్. నటరాజ రామకృష్ణ:
   దక్షిణాత్యుల నాట్యకళా చరిత్ర

2. డాక్టర్. యస్. గంగప్ప
   తెలుగులో పదకవితలు.
   క్షేత్రయ్య పదములు.
   తెలుగు వాగ్గేయకారులు.

3. డాక్టర్. విస్సా అప్పారావు
   క్షేత్రయ్య పదములు.

4. డాక్టర్. పోణంగి శ్రీరామ అప్పారావు
   నాట్య శాస్త్రము.

# కృతజ్ఞతలు

నాయీ సిద్ధాంత వ్యాసము వ్రాయుటకు సహకరించిన
గురువరేణ్యులైన శ్రీ ఆచార్య యల్లా వెంకటేశ్వర రావు గారు,
శ్రీ. యస్. కె. వెంకటాచారి గారు, డాక్టర్. నటరాజ రామకృష్ణ గారు,
డాక్టర్. పోణంగి. శ్రీరామ అప్పారావు గారు, డాక్టరు. శ్రీమతి ప్రణాళిని గారు
సప్తస్వరములు నేర్పించిన (రాజమండ్రి వాస్తవ్యులు) శ్రీ. ఎడిద
కొండల రావు గారు, నా తల్లిదండ్రులు, నా అత్తమామ గారులకు,
నా హృదయ పూర్వక అభినందనములు.
నా సోదరీ మణులు చి॥ క్రిష్ణకీర్తి, చి॥ కీర్తి సరస్వతి నా హృదయపూర్వక
అభినందనములు. నా స్నేహితుడు శ్యామ్ కుమార్ కి అభినందనములు.

నా భర్త శ్రీ ఆచంట సూర్యనారాయణ అడుగడుగున నన్ను
ప్రోత్సహించినందుకు నా హృదయ పూర్వక అభినందనములు. మరియు
నా తనయుడు చిరంజీవి హనుమత్ శ్రీ కి నా దీవెనలు.
నా జ్యేష్ఠ సోదరుడు శ్రీ. కె. వి పంతులు కి నమస్కారములు.

ఇట్లు
సత్యవతి.

# విషయసూచిక

# తొలి పలుకు

ఆంధ్రదేశమునందలి గేయములను కృతులు, తత్త్వములు, పదములు జావళీలు, పాటలు అని ఆరు విధములుగా విభజింపవచ్చును. ఇందు పదము, జావళీ అను రెండును అభినయానుకూలములును శృంగార రస ప్రధానములు నైన గేయములే గాని జావళీయందు శృంగారమును పదమునందు ప్రౌఢత్వమును ప్రాధాన్యము వహించును. పదములు, రాగ, తాళ, విలంబనములతో కూడి యుండును.

క్షేత్రయ్య పట్టి పదకర్త మాత్రమే కాడు. అలంకార శాస్త్రముతో గాఢమైన పరిచయము సంపాదించి యందు నూత్నమార్గములు త్రొక్కజాలిన సాహసము కలవాడు. ఒక్క గొప్ప ప్రతిభాశాలి. ఆంధ్రదేశమునందంతటను దక్షిణదేశములోని విశేష యశస్సును గాంచిన ధీనిధి ఇతడు రచించిన పదములు కోమలములును, రమ్యములు తేటతెనుగు పదముల పొందికతో జెన్నారుచున్నవి. ద్రాక్షా పాకమున రచితములైన యితని పదములన్నియును రసపూరితములైన సంగీత సాహిత్యముల రెంటను గూడ నత్యంతమయిన యున్నతి చెందియున్నవి. సమగ్రశాస్త్రమై సుప్రసిద్ధిబొంది భాసిల్లు భరత నాట్యమున కెంతయో ననువుగనున్నవి.

ఇందలి పదముల పొందిక సుందరమైనది. మనము సామాన్యముగా వాడుచుండు పదపద సంపద యిందు దనరారును. ఇతని కూర్పులలోని యలతి తేట తెలుగు పదములతో జిలుగు గలిగి రసములొలుకులాడుచు గులుకుచుండును. శైలి మిగుల సుగమము. ఈ పదములందలి పదజాలము రసోచితరీతిని దేజరిల్లును. పద లాలిత్యము అసమానమై ప్రతి పదమునందు గానగును. పశ్చిమదేశములలో నిటాలియన్ భాష రీతులో యటులే ప్రాచ్య దేశములలో దెలుగు విశేష శ్రావ్యమైనదని భాషా తత్వవేత్తలలో నగ్రగణ్యుడుగ నెన్నబడిన బిషప్ కాల్డ్ వెల్ మిక్కిలి నెక్కుడుగ బొగడెను. అతని మతమీ పదములందు అత్యంతము తగియున్నది. పలుకుపలుకునకు తేనియలొలుకుచుండును.

# పరిచయము

క్షేత్రయ్య పదములు అనగానే త్రివేణి సంగమము గుర్తుకు వచ్చును.

త్రివేణి సంగమము అనగా మూడు నదుల కలయిక. మన భారత దేశములోని 'ఉత్తరప్రదేశ్' రాష్ట్రమునకు చెందిన 'అలహాబాదు' నగరము వద్ద ఉత్తర వాహిని అయిన 'గంగానది', నీల వర్ణము కలిగిన 'యమునా' నది అంతర్వాహిని అయిన సరస్వతి నదులు కలయును. ఆ కలయికనే త్రివేణి సంగమము అందురు.

క్షేత్రయ్య పదములందు మూడు నదులవలె సంగీతము, సాహిత్యము, అభినయము కలసి ఉన్నవి. అందుచే క్షేత్రయ్య పదములు త్రివేణి సంగమము అని అనవచ్చును.

1. గంగానదిని అభినయముగా వర్ణించ వచ్చును. ఎందుచేతననగా ఎంతో విశాలమైన గంగానది వలె అభినయము క్షేత్రయ్య పదములందు కలదు.
2. భగవత్ స్వరూపుడైన శ్రీకృష్ణుడు యమునా నదిలో గోపికలతో కలసి జరిపిన రసక్రీడలకు నిలయమైనటు వంటి యమునా నది వలె క్షేత్రయ్య పదములందు సంగీతము (రాగ తాళ లయలు) నిండి యున్నవి.

3. ష్టికి కనిపించకుండ అంతర్వాహిని అయిన సరస్వతి గంగా
యమునా నదులతో ఏవిధముగా కలియునో ఆ విధముగా
క్షేత్రయ్య పదములందు సాహిత్యము కలసి ఉన్నది.
అందుచే క్షేత్రయ్య పదములు త్రివేణి సంగమము అని చెప్పవచ్చును.

# పదకవితావిర్భావము

'పాడదగిన కావ్యమునకు పదము అని పేరు. పదకవిత్వము పద్య కవిత్వము కంటె ముందు పుట్టినది. చిత్రవిచిత్ర కావ్యకమనీయ పర్వతారణ్య మైన ప్రకృతిలో పుట్టి పెరిగిన ప్రాకృత జీవియగు ప్రాకృత మానవుని హృదయమున సంతోషమయమో, దుఃఖమయమో యగు ఒకానొక భావము జనించి, పరవశునిగా చేయగా అతని నోట వెంట అప్రతర్కితముగా ఒక పాట వ్యక్తమైయుండవచ్చుననియు, ఆవేశపూరితుడై అతడా పాటను చిందులు త్రొక్కుచూ పాడియుండవచ్చుననియు, ఆట - పాట లేక నృత్యము [illegible] గీతము 'బేలాడ్ నృత్యము' అని పేరు పెట్ట వచ్చుననియు, అదియే కవిత్వమునకు శ్రీకారమనియు ఈ సిద్ధాంతము యొక్క సారాంశము.

''ఈ ఆట పాటలలో మూడు భిన్నకళాంశములు కలవు. అడుగువేయుట, రాగము తీయుట, మాటపలుకుట. శాస్త్రభాషలో ఈ మూడింటికి నృత్తము, గీతము, శబ్దము అని పేరు.''

ఈ మూడు అంశములను మూడు శాఖలుగా కాలక్రమమున నాట్యము, సంగీతము, పద్యము అనెడి కళలుగా పరిణమించి దేని రాజ్యమును అది యేలు కొనసాగెను. కాని ఈ మూడింటికి జన్మస్థాన మొక్కటియే. అవి స్వతంత్రతా నిరూపణార్థము ఎంత విడిపోయినను పరిణత సంపూర్ణ స్వరూపములో మరల ఏకీభవించు చుండును.

"ఈ పద కవిత్వమున శబ్దమున కెంత ప్రాధాన్యమున్నదో గీతికకును అంతే ప్రాధాన్యమున్నది." - అనగా ఇందు సుందర శబ్దరచనకు మధుర మైన పాటయును కలసి యుండును.

పదకవితనుంచే పద్యకవిత్వ ముద్భవించిందనీ, పదమే ప్రాచీనమనీ కూడ చెప్పవచ్చును "మనదేశములో చాల పాతపాటలు వేదసూక్తములు. మనుష్యజాతికి అవి మొదటి రచనలు, అని ఊహింపవచ్చును. ఈ రాగ తాళములు రెంటిని కలిపి హృదయంగమములైన భావములను వెలువరచు భాషను అలంకరించుటయే పదరచనకు పరిపూర్ణ స్వరూపము." దానిపూర్ణానుభవమును, మనకప్పుడే సతాళముగనో, వితాళముగనో కావ్యకళా రసానుభవమును ప్రాచీన మనుష్యజాతి పాట రూపముననే అనుభవించి రచించినది అని పండితులూహింతురు.

# పదనిర్వచనము

పదం అంటే సామాన్యార్థంలో పాట అని వాడుక ఇది రాగతాళములతో ఉండవచ్చును లేదా కేవలం స్వరసహితము కావచ్చును ఇది జానపదుల సాహిత్యములో స్పష్టంగా తెలుస్తుంది. కోలాటం దంపుళ్ళపాటల్లో తాళముంటుంది. రాగంతో పాటు, విసరాయి. కపిలి పాటల్లో రాగమే కాని తాళానికి అవకాశం లేదు. పదం పాడమన్నది జనవ్యవహారం. మన నిత్య జీవితము లలో పదమును పద్యముగాను, పద్యమును పదముగాను వాడుచుందురు.

ఎందుకంటె సామాన్యంగా పల్లెప్రజలు పనిపాటలు చేసేటప్పుడు ఉత్సాహము కోసమో. పరిశ్రమ మూలకమైన బడలికమైనుండి మనస్సును మళ్ళించడం కోసమో. కాలక్షేపం కోసమో ఏదైన ఎవరైనా పాడితే బాగుంటుంది. అలా అనుకున్నప్పుడు ఈ విధముగ అనడం జరుగును.

''ఓసేయ్ బుల్లి పదం అనవే. పదం ఎత్తవే, పదం అందుకోవే, పదం పాడవే, అనేటటువంటి మాటలతో కోరడం జరుగుతుంది.''. ఇటువంటి సందర్భాలలో కేవలం పాట మాత్రమే పాడడం జరుగదు. పద్యాలు పాడడం కూడ జరుగుతుంది. అందుచే వారి దృష్టిలో పదం అంటె పాట కావచ్చు, పద్యము కావచ్చును.

# భరతముని నిర్వచనము

'' గాంధర్వం యన్మయాప్రోక్తం, స్వరతాళపదాత్మకమ్
పదం తస్య భవేద్వస్తు స్వరతాళానుభావకమ్
యత్కించి దక్షర కృతం తత్సర్వం పదం సంజ్ఞితమ్
నిబద్ధం చానిబద్ధంచ తత్పదం ద్వివిధం స్మృతమ్
అతాళంచ, సతాళంచ ద్విప్రకారంచ తద్భవేత్
సతాళంచ ధ్రువారేషు నిబద్ధం తచ్ఛన్మేస్మృతమ్ ''

- స్వగతాళపదాత్మకమైంది గాంధారమనీ, స్వరతాళానుభావకమైన పదమే వస్తువనీ, అర్థ సహితమైన అక్షరాలతో కూడినది 'పద' మనీ, ఈ పదం నిబద్ధం, అనిబద్ధం అని రెండు విధానాలనీ, అవి అతాలము, సతాలమూ నని రెండు విధాలనీ భరతముని నిర్వచనము.

నియతాక్షర సంబంధము కలిగి చందోయతి సమన్వితమై తాళపాదములతో కూడిన పదము 'నిబద్ధ పద' మనబడును. యతి పాద నియమము లేనిదియు అనియతాక్షరమును అగు పదము 'అనిబద్ధ' మన బడును. నిబద్ధ పదాలతో ప్రధానములు వృత్తపదాలు. ఇవి సమవృత్తాలు, అర్థసమవృత్తాలు. విషమవృత్తాలు అని మూడురకాలు. సంగీత పరిభాషలో ఈ పదాలు ప్రబంధాలు అనబడతాయి. పైన భరతముని చెప్పినట్లు మతంగుడు శార్ఙ్గదేవుడు వెంకటమఖీ కూడ చెప్పినారు. ఇంక ఈ ప్రబందంలోని అవయవాలు అంటే ధాతువులు మొదలైన వాటిని పరిశీలిద్దాం. ''ప్రబంధ శరీరాలు 4 భాగములు, 4 ధాతువులు. అవి ఉద్గ్రాహము, మేలాపకము, ధ్రువము, అభోగము, ఉద్గ్రాహము ప్రబంధపు మొదటిభాగం. అనగా ఆరంభం, ధ్రువము ప్రబందపు ముగింపు.

మేలాపకం ఉద్గ్రాహధ్రువాలను కలుపుతుంది. ఆభోగం ప్రబంధ రచయిత నామమో అంకితమిచ్చిన దేవతానామమో ముద్రగా కలిపిన తుది భాగం..........

ఈ ధాతువుల ఏర్పాటును బట్టి ప్రబంధాలు మూడు విధములు. 1. ద్విధాతుకాలు 2. త్రిధాతుకాలు, 3. చతుర్ధాతుకాలు ద్విధాతుకం అంటే ఉద్గ్రాహ ధ్రువములు మాత్రమే ఉండే ప్రబంధం. ఉద్గ్రాహ ధ్రువాభోగాలుండేది చతుర్ధాతుకం''.

''స్వరం, బిరుదం, పదం, తేనకం, పాటం, తాలం అను ఆరు ప్రబంధానికి అంగాలు......... ఈ అంగాలతో విరచితమైన ప్రబంధాలు ప్రత్యేకం నాదాత్మకాలు. అంటే మాతురచనా ప్రధానములు కావన్నమాట మరొక మూడు విధాలయిన ప్రబంధ విభజన ఉంది. అవి ఏవంటే సూడ ప్రబంధాలు, ఆళిసంశ్రయాలు, విప్రకీర్ణాలు''. ఏలాదులు ఎనిమిది మొదటిరకం వర్ణాదులు 24 రెండోరకం శ్రీరంగాదులు మూడోరకం.

స్వరరాగాలతో పాడబడేది గీతం ''స్వరరాగైః ప్రగాయంతి గీత మిత్యభిధీయతే'' శార్ఙ్గదేవుడు గీత ప్రబంధములకు ఒకే అధ్యాయం చెప్పాడు. వెంకటమఖీ మాత్రం గీతాలకు ప్రత్యేక అధ్యాయం చేప్పాడు.

పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడు అని ప్రసిద్ధిపొందిన అన్నమాచార్యుడు సంస్కృతములో రచించిన సంకీర్తన లక్షణాన్ని, అతని మనుమడు చిన తిరుమలాచార్యుడు తెలుగులో పద్యాత్మకంగా రచించినాడు. అందులోని పదకవితాలక్షణం క్లుప్తంగా ఇది చాల వరకు భరతాదులు వచించిన పద్ధతి. యు స్నది.

''భరతాదులు గ్రంధంబుల
విరచించిన లక్షణములు వేంకట భూవీ
ధరవర కీర్తన లక్షణము
లరం పద కవితా పితా మహుండేర్పరచెన్'.
అని చినతిరుమలాచార్యుడే చెప్పి ఇంకా పదసంప్రదాయాల్ని ఇలా
వివరించాడు.

'''రసార్ణవ సంగీతము రత్నాకర ప్రబం
ధా ధ్యాయమున నుక్తంబయ్యె బదము
సముచిత సంగీత చంద్రికా దేశ్మేళ
మందు మిక్కిలి దేటమయ్యే, బదము
అతుల తత్సంవాదమ్మెనట్టి సంగీత
చూడా మణికి బలుచోట పదము
ధన్య సంగీత సుధాకర గ్రంధంబు
నందు మిక్కిలి జెలువొంద' బదము
తానే యిన్నిటికి మూలమ్మైన భరత
మందు, బంచ దశాధ్యాయ మందు విమల
నృత్త చూర్ణ నిబంధక వివిధ నామ
భవ్య లక్షణములకు నాస్పదము పదము', అని నిర్ణయించెను.

పదాలు శృంగార, వైరాగ్య పదాలని ద్వివిధం. ఈ శృంగార పదాలు గ్రామ్యోక్తులతో ఉండవచ్చును.

"పదములు శృంగార వధూ,
మృదు మధుర మనోజ్ఞ
వాక్య విశ్రమములైనన్
విదితార్థ గ్రామ్యోక్తులు పదిలముగా బొంక మెఱిగి పలుకగ జెల్లన్"

అయితే వైరాగ్య పదాలు అలాగాక అగ్రామ్య రమ్య విష్ణు చరితో దారమై ఉండడం అవసరం. వీటినే ఆధ్యాత్మపదాలంటారు.

పదములంటే వైరాగ్య, శృంగార, పదములు ఇంకెన్నియో విధములు చెప్పబడినను ప్రస్తుతము ఉన్న కాలములో సంగీతలోకములో పదములు అనగా శృంగారపదములు, నాయకా, నాయకుల యొక్క విరహ వియోగాలు, ప్రణయ కలహాలు, ఇత్యాదులను తెలుపునట్టి పాటలను ముఖ్యముగా పదములను పేరుతో పిలుచుట వాడుక అయినది. అందు ముఖ్యముగా నేను ఈ వ్యాసములో చర్చించుచున్నది క్షేత్రయ్య పదములకు సంబంధించినది. అందు వలన ఈ వ్యాసములో ప్రత్యేకముగా క్షేత్రయ్యపదములు వాటియొక్క సంగీత విలువలు, సాహిత్యపు పోకడలు, అభినయరీతులను చర్చించుచున్నాను.

# ఉత్తమ వాగ్గేయకార లక్షణములు

పదంలోని వాక్కు, మాతు, గేయం ధాతువు, అన్నీ వాక్కును గేయాన్ని రచించగలవాడు వాగ్గేయకారుడని అర్థం. కాగా వాగ్గేయ కారునకు ఉండవలసిన లక్షణాలు.

''శబ్దాను శాసన జ్ఞాన మభిధాన ప్రవీణత

చన్దః ప్రభేద వేదిత్వ మలంకారేసు కౌశలమ్''

- శబ్దాను శాసన జ్ఞానము, అభిధాన ప్రవీణత, రసభావాల పరిజ్ఞానము, లోకజ్ఞత, అశేష భాషా జ్ఞానంతో పాటు సమస్త కళా శాస్త్రాల్లో అభినివేశము, నృత్య, గీత వాద్యాల్లో నేర్పు, మనోహరగాత్రం తాళలయజ్ఞానము, కాక్వాదుల వివేచక ప్రతిభ, సుభగగేయత, దేశీరాగాల్లో సంపూర్ణజ్ఞానము, వాక్పటుత్వం, సరసత, ఔచిత్యజ్ఞానము, నూత్నధాతు నిర్మాణక్షమ, ఇతరుల చిత్తవృత్తుల పరిజ్ఞానము, ప్రబంధప్రాగల్భ్యం, ద్రుత గీత నిర్మాణంతో పాటు నానా గీత రచనా దక్షత, మంద్ర, మధ్యమ తార స్థాయిలలో గమకం ప్రయోగించగల నేర్పు ఆలాపనలో సంపూర్ణ జ్ఞానము, అవధానం - అంటె చిత్తైకాగ్రత అనే గుణాలు కలవాడే ఉత్తమ వాగ్గేయ కారకుడు. అటువంటి వాడు క్షేత్రజ్ఞ.

# క్షేత్రయ్య జీవిత విశేషములు

''సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయం।
ఏక మాపాత మధురం అన్యదాలోచనామృతం ।।

అనగా సంగీత, సాహిత్యములు సరస్వతీదేవి స్థనాల జంట. మొదట సంగీతము వినిన వెంటనే ఆనందము కలుగును. రెండవది సాహిత్యము ఆలోచించిన కొలదీ అమృతమయమైన అర్థాలనిస్తుందని అర్థం.

'' శిశుర్వేత్తి, పశుర్వేత్తి, వేత్తి గానరసఫణి ''.

అంటే శిశువులు, పశువులు, పాములు సైతం విని ఆనందించదగిన గానరసం. అట్టిగాన మెరిగినవాడు శ్రీరామరాజభూషణుడు. ఇతడు సంగీత, సాహిత్యములందు సంపూర్ణ విజ్ఞానం సంపాదించిన మహా కవి.

కాని అంతకంటే మరొక మెట్టు ముందు కరగిన వాడు క్షేత్రయ్య. క్షేత్రయ్య సంగీత, సాహిత్యములను సారమెరిగిన వాడు గాన వీటికి అభినయం జోడించి రాణింపజేసిన మహా రసికాగ్రసంతుష్టమైన భక్తాగ్రేసరుడు. రసరాజు, శృంగారాధి దేవత శ్రీకృష్ణుడును తన పదకవితల ద్వారా వైవశం చేసుకొని ఆరాధించి తరించిన ధన్యజీవి క్షేత్రయ్య.

క్షేత్రయ్య 1590 - 1675 నకు చెందినవాడు. అన్నమాచార్యుని తరువాత అంతటి వాగ్గేయకారుడు క్షేత్రయ్య. క్షేత్రయ్య జీవిత చరిత్ర పలువురు ప్రముఖుల పరిశోధనప్రకారం. 16వ శతాబ్దమునకు చెందినవాడు.

కృష్ణాజిల్లాలోని మువ్వ గ్రామ నివాసి. ఇంటిపేరు కూడ మువ్వ. తెలింగ

బ్రాహ్మణుడు. తల్లిదండ్రులు తెలియదు. చదువు సంధ్యలు అబ్బలేదు.

వయసులో రసికుడుగా ఉండేవాడు. ఇతని మొదటి పేరు వరదయ్య.

కాని కాలక్రమేణా క్షేత్రయ్యగా మారినది. ఎందుకంటే అనేక పుణ్య

క్షేత్రములు తిరిగి ఆ క్షేత్రములందలి దేవాలయములందు ప్రతిచోట

తను ఒక యతిచేత మువ్వగోపాల మంత్రోపదేశము పొందిన తన మువ్వ

గోపాల పదములను పాడుచుండుటచే వరదయ్య క్షేత్రయ్యగా పిలువబడ్డాడు.

కాని కేవలం క్షేత్రములు తిరిగినందువల్ల కాక ఈ విధముగ కూడ ఊహించ

వచ్చును.

భగవద్గీత 13వ అధ్యాయమునందు క్షేత్రజ్ఞుడు అంటే ఈ విధముగా

నున్నది.

"ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే

ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః".

- అర్జునా త్రిగుణాత్మికమగు సమస్త కారణ విషయస్వరూపములుగా

మారి జీవునకు భోగమోక్షములనెడు ప్రయోజనము కలుగజేయు నివిత్తము

దేహేంద్రియాద్యాకారముగా నేర్పడుచున్నది. అటేర్పడినదియే శరీరము. ఇది

క్షేత్రమనబడును. ఆపాదమస్తక పర్యంతరమున అవయవములతో గూడిన

ఈ శరీరము తనకంటె వేరని తెలుసుకొనినవాడే క్షేత్రజ్ఞుడని పెద్దలు చెప్పుదురు.

అందువలన ఈ దేహము క్షేత్రము. ఈ దేహమును తెలుసుకున్నవాడు క్షేత్రజ్ఞుడు.

అట్టివాడు కనుకనే వరదయ్య క్షేత్రయ్య అయినాడని పెద్దల అభిప్రాయము.

కాని క్షేత్రయ్య పదములు కొందరు పచ్చిశృంగార పదములని విమర్శించినప్పటికీ, ——

"మహాకవి వేమన సూక్తి ప్రకారము
కామిగాక మోక్షగామి కాడు". ——

అన్నరీతిని ఆయన పదములందు రాధా-మాధవ ప్రణయ లీలలు మధుర భక్తి భావములతో పాడి, తరించుటకు ఆ కవిత ఉపయోగపడు నట్లు మరి కొందరు శాస్త్రజ్ఞుల అభిప్రాయము.

క్షేత్రయ్య విజయ రాఘవ నాయకుని కాలమువాడు. సంస్కృతాంధ్ర సాహిత్యములలో సంగీతము, నాట్యము, అలంకార శాస్త్రములలోను క్షేత్రయ్య గొప్ప ప్రతిభగలవాడు. చక్కని జాను తెలుగులో నాడినుడి కారములొలికేటట్లు పదములను క్షేత్రయ్య రచించినాడు. మరియు శృంగార రసనిధానములగు నాయిక, నాయకుల మనోభావాలను ఉత్తమమైన శైలిలో వాడుకభాషలో రచించినాడు.

క్షేత్రయ్య 54 రాగములలో రక్తిభావములతో పదములు రచించినాడు. శృంగారరసభావములకు నిలయమైన కాంభోజిరాగములో ఎక్కువ పదములు రచించినాడు.

క్షేత్రయ్య తన మొట్ట మొదటి రచన "శ్రీపతి సుతుబారికి" అనే పదమును ఆనందభైరవి రాగము ఆదితాళములో రచించినాడు.

క్షేత్రయ్య తనపదాలను వివిధ సంస్థానాలలో పాడి, గౌరవప్రతిష్ఠలు సంపాదించుకొనినాడు. ఈ క్షేత్రయ్య సందర్శించిన ప్రతిక్షేత్రములోని వివిధ దైవములమీద రచనలు చేసి తన ఇష్టదైవమైన మువ్వగోపాలునికి ''అంకితము దేవతల ద్వారా అంకితములు చేసినాడు.'' (గనుకనే ఆ దేవుని ఉపముద్రతో గోపాల ముద్రతో నుండును.) అవి ——

1. వీర రాఘవ స్వామి — స్వామినేమేవ్వరే.
2. కంచివరదరాజు — ముందటి వలెనాపై.
3. గోవిందరాజు —— విందుఋ ప్రీతిరిగేనా.
4. రంగనాథ —— పచ్చివెదలిదేవర. మొదలగునవి.

పూర్వము సంగీతవిద్వాంసులు వారి కచ్చేరీలలో పదానికి చాల ప్రాముఖ్యత నిచ్చేవారు. ఉదాహరణకు పల్లవిలేని అనుపల్లవి ఎలా ఉండదో అటులనే పదమును కచ్చేరియందు వినాయకప్రార్థనవలె ముందు పాడుటకు ప్రాముఖ్యత నిచ్చేవారు. (అంటే వారు ఒక గీతములో మనము పల్లవికి, ఎంతప్రాముఖ్యము నిస్తామో పదమునకు అంత ప్రాముఖ్యత నిచ్చేవారు.)

క్షేత్రయ్య యొక్క పదాలను రెండు విధాలుగా ప్రదర్శింపవచ్చును.
1. బహిర్ శృంగారము మరియు 2. అంతరభక్తి శృంగారరసములు.
1. ఉదాహరణః- నాట్యము, 2. ఉదాహరణః- రాధామాధవ ప్రణయ శృంగారము.

క్షేత్రయ్య తంజావూరు విజయరాఘవ నాయకుని ఆస్థానములో ఉండగా రాజు అర్థించగా 'పది' పదములను రాజునకు అంకితము చేసెను.

(అవి సంతకము లేకుండా) ఈ పదములు విజయరాఘవ పంచరత్నములుగా బాగా ప్రచారము లోనికి వచ్చెను.

విజయరాఘవ కొలువునందు క్షేత్రయ్యకుగల ప్రత్యేక గౌరవ అభిమానము లకు ఇతర ఆస్థాన పండితులు అసూయచెంది ఈయనను వివర్శించగా క్షేత్రయ్య 'కాంభోజి' రాగము త్రిపుట తాళములో "పదరక పోపోవే" అనే పదాన్ని రచించి చివరి చరణములో రెండు వరుసలను వదలి వాటిని ఆస్థాన కవులను పూరింప చేయమని సేతుయాత్రలకు (తీర్థయాత్రలకు) వెళ్ళెను. తిరిగి వచ్చు నాటికి విద్వాంసులు పూరించలేక వారి తప్పు తెలుసుకొని ఆపదమును పూరించమని ప్రార్థించగా వెంటనే క్షేత్రయ్య ఆపదమును ఈ క్రింది విధముగ పూరించెను.

"రామ, రామ! ఈమేనితోనికళ్ళాని
మోము జూడవలెనా?
మొదటి పొందే చాలు". అని పూరించెను.

దీనితో క్షేత్రయ్య గౌరవ మర్యాదలు ఇంకను ఇనుమడించెను. ఈ లిఖిత పూర్వరచనలందు ప్రతిపదముమైన అవి ఏసందర్భమున పాడవలెనో మరియు ఏనాయిక, ఏనాయకునికి ఉద్దేశించి పాడవలయునో అనే మొదలగు సంబంధిత విషయములు కలవు. ఈయన రచనలలో వివిధ రసభావములను పలికించుటకు అనుకూలముగా సంగీతము, సాహిత్యములు ఇందు రచన చేయ బడినవి. మరియు అనేక విధముల శోకరసమును ప్రదర్శించుటకు క్షేత్రయ్య ముఖారి, ఘంటా, నాదనామక్రియ, పున్నాగవరాళి, మరియు ఆహిరి రాగము లను ఉపయోగించి రచన చేసినాడు.

ఈయన రచనలు ముఖ్యముగా నాయకుని రాకకు వేచి అయిన ఆలస్యమునకు కాని, రానందుకు కోపముతోగాని అసూయ చేత గాని, అనేక విధములయిన ఆలోచనలతో నాయిక భరింపరాని బాధచే తన సఖికి తన బాధను వెల్లడించెడి సన్నివేశములుండును.

నిరాశ చెందిన నాయిక, నాయకుని అవమాన పరచుచు నాయకుని నమ్మకద్రోహాన్ని గుర్తించియు తెలియును.

నాయకుని అతని క్రీడలను, (గుర్తు తెచ్చుకొనుటకు) అతనితో ఆమె కలయికను గుర్తు తెచ్చుకొనును.

చాలా కాలము తరువాత నాయికా, నాయకులు కలుసుకొనుటకు మొదలైన విలువైన లక్షణాలు తెలుపును. మరియు ప్రతిరాగము యొక్క లక్షణము భావనలను తెలుసుకొనుటకు చక్కటి సందర్భములను కలిగియుండును. క్షేత్రయ్య పదాలు సంగీతకళా చిత్రమునకు తోరణములు. ఈయన పదములను పాడునప్పుడుగాని, అభినయించునప్పుడు గాని, ఆయా నాయక, నాయిక లేక సఖి మనసులోనుంచి వెలికి వచ్చి చూచువారికి, వినువారికి, గాయకుడికి ఆనందమును చేకూర్చును. వానిలోని మృదువైన పదములకూర్పు ప్రతి హృదయమును కదలించును.

క్షేత్రయ్య గానరసమునే గాక రక్తిరసాన్ని ఆధారముగ చేసుకొనెను. ఈయన మొత్తము రచనలలో త్రిపుట తాళము ముఖ్యస్థానము కలది. లఘువునకు మూడు ధ్రుతమునకు రెండు –రెండు, మొత్తము ఏడు అక్షరముల($I_3+O_2+O_2$) కాల ప్రమాణము. ఇతను వాడిన తాళములు ఆది, రూపక, తాళములను కూడా వాడెను.

త్రిపుట తాళమునందు క్షేత్రయ్య తన పదములను ఎక్కువగా రచించెను. ఎందువలనంటే అభినయమునందు నర్తకికి, సంగీతమునందుగాయకునికి, వివిధ భావములను ప్రదర్శించుటకు అవకాశముగలదు. మరియు క్షేత్రయ్య వాడిన తాళములు. ఆదితాళము, రూపకతాళము, అటతాళములను వాడెను.

క్షేత్రయ్య పదములందు మనోజ్ఞపదరచన మధుర భక్తి గురించి ముందు తెలుసుకుందాము.

OOOOOOOOO

# క్షేత్రయ్య పదములందు సంగీతము

"సామవేదాదిదం గీతం, సంజగ్రాహ పితామహః"
(సంగీతరత్నాకరము)

సంగీతము సామవేదమునుండి బ్రహ్మచే గ్రహింపబడి లోకోపకారమై, భరతాదుల చేతను తరువాత ఇతర వాగ్గేయ కారుల చేతను, వెల్లడి చేయబడిన శాస్త్రము.

"గీతం, వాద్యం, తథానృత్యం, సంగీతముచ్యతే"

గీతము, వాద్యము, నృత్యము మూడింటి కలయికను సంగీతము అందురు. ఈ సంగీతము నృత్య సంగీతము, కచేరి సంగీతమనబడును. ఈ రెండు సంగీతములు శృతి లయలతో కూడి యుండును. నృత్య సంగీతము అనగా అభినయమునకు, కూచిపూడి నృత్యము, భరతనాట్యమునకు, ఆంధ్రనాట్యము నకు మొదలగు నృత్యములకు వెనుకగా పాడేటువంటి సంగీతమును నృత్యసంగీతము అందురు. సాహిత్యమునకు నర్తకి చేయునాట్యమునకు అనువుగా గాయకి తన గాత్ర మాధుర్యముతో నర్తకి చేయు అభినయముల యొక్క భావమును గాయకి తన గాత్రమాధుర్యముతో గానము చేయునది నృత్యసంగీతము అందురు.

కచేరీ సంగీతము అనగా సంగీతమునందు గల మాధుర్యమునంతయు కచేరి చేయు గాయకుడుగాని, గాయకి గాని స్వీకీయముగా పాడునటువంటిది.

గాయకుడు తనకు ఇష్టమైన రీతిలో మనోధర్మపాండిత్యము నంతయు ప్రదర్శించును.
మరియు ఒక క్రమ పద్ధతిలో అనగా కచేరిప్రారంభమున ఏదైనా వర్ణమును
పాడి తరువాత గణపతి ప్రార్థనతో కచేరి మొదలుపెట్టి ఏదైనా ఒక రాగమును
ప్రథమముగా తీసుకుని ఆ రాగమును 10 నిమిషములు రాగాలాపన చేయుచూ
ఆ రాగములో కీర్తనను పాడి అందులో నెరవల్, స్వరకల్పనలతో తన
ప్రతిభను నిరూపించును. అటుపిమ్మట అన్నమాచార్యకీర్తనగాని, జయదేవఅష్టపది
గాని, మైసూరు వాసుదేవాచార్యకీర్తనను గాని. క్షేత్రయ్యపదమునుగాని పాడి
మంగళముతో కచ్చేరిని ముగింతురు. ఇదియే కచ్చేరిసంగీతము.

క్షేత్రయ్య తన పదములకు సంగీతభాణిని కూర్చుటలో ఆరితేరినవాడు.
ఈ పదములను సవర్ణవంతముగా పాడినచో రక్తిగానుండును. సాహిత్యము
లోని రసానికి అనుగుణముగా రాగాలు కూర్చబడినవి. ఈ పదములోని రాగ
భావమును, సాహిత్యభావమును, చక్కగా వెలికి తెచుటకు రాగమును శృతిలో
మరియు మృదుమైన గమకములతో ఆలపించవలెను.

క్షేత్రయ్య పదములందు అభినయమునకు ఎక్కువగా ప్రాధాన్యత ఉన్నను
సంగీత ప్రాధాన్యమువల్ల, కళాకారుడు కచ్చేరియందు ఒకటి లేక రెండు
పదములు పాడనిదే కచ్చేరి సంపూర్ణముగా నుండదు. శృంగార రసమునకు
నిలయమైన <u>కాంభోజి రాగమునందు</u> 42 కీర్తనలవరకు రచించెను.

శోకరసమును పోషించుటకు వివిధకోణములు:- అంటే ''కరుణరసంలో బాహ్యమాత్రమైన దుఃఖము, ఉపశమించుకోగల దుఃఖము, దుర్భరమైన దుఃఖమూ, హృదయవిదారకమై బావురుమనే విలాపంతో కూడిన దుఃఖము వివిధ దుఃఖావస్థలు గల పదాలకు ముఖారి, ఘంటా, నాదనామక్రియ, పున్నాగవరాళి, కాంభోజివంటి రాగాలకు వాడుకున్నాడు. ప్రస్తారానికి పూర్తి అవకాశములేని ఆహరి, ఘంటా సైంధవి, కర్ణాటక, కాఫీ నవరోజు వంటి రాగాలను కూడ బహుసూక్ష్మ ప్రయోగాలలో వాడి, ఒడలు రక్తులు వసిపించగలిగినాడు.

ఉదాహరణకు:- దుఃఖములోనున్న నాయిక తన భావాలను తనసఖితో చెప్పుట. భగ్నహృదయురాలైన నాయిక గత స్మృతులను తలచుకొంటూ తనను తానే ఓదార్చుకొనుట. నాయకుడు రానందుకు నాయిక తన విసుగును తెలియజేసే పదములు అసూయ, నిస్పృహ ంయత, భంగపాటును తెలియజేసెపదములు.

క్షేత్రయ్య పదములలోని పల్లవి, అనుపల్లవి, చరణములలో రాగము కళ్యములగ ఎట్లు వృద్ధి చేయబడినదో, ఒకే రాగమందలి వివిధ పదములలోని స్వర సంచారములు, గమకభేదములు, అలంకారములు, పదములయొక్క భావాను గుణముగా రసమును కురిపించుచు ఒకేరాగమునందు అనేక భావభేదములను ఎన్ని విధముల వాడబడినదో క్షేత్రయ్య సంగీతానుభవమునందు గోచరించును.

క్షేత్రయ్య పదములందు రాగ స్వరూపమతి సుందరము. మనో
హరము. ఎందుకంటె రాగమునందు ఎత్తుగడ, తరువాతనడక, స్వరసంచారములు
కూడికలు, పోకడలు, రాగముయొక్క జీవకళలను పదగమనంతో ఆవాహనింప
చేసెను. ఇట్టి రాగ రచన చేసి రాగమునకు రససిద్ధిని కల్పించి రాగము
యొక్క సంపూర్ణస్వరూపమును నిరూపించి సంగీతములో రాగమునకు గల
ఉన్నతస్థానమును క్షేత్రయ్య నిర్ణయించి, తరువాత వాగ్గేయకారులకు సంగీత
వేత్తలకు మార్గదర్శి య్యైనాడు.

క్షేత్రయ్య పదములు విలంబకాలములో పాడినచో శబ్దార్థములను
చక్కగానెరిగి వాని భావమును తెలుసుకొని సంపూర్ణ ఆనందం పొందవచ్చును.
మరియు సాహిత్యమును తాళముకొరకు అడ్డదిడ్డముగ విరువనవసరముండదు.
సాహిత్య శుద్ధి కలిగి, భావమును తెలిసి కాల ప్రమాణము నెరిగి పదములను
పాడినచో పల్లవి, అనుపల్లవి, చరణములోనికి రాగభావములు పెరిగి చరణము
పూర్తికాగానే పల్లవిలోని రాగభావములకు తిరిగి ఎట్లు చేకూరునో స్పష్టము
కాగలదు.

క్షేత్రయ్యకు పూర్వముగాని, తరువాతగాని, ఇటువంటి రచనలు రచింప
బడలేదు. ఇవి ఎక్కువగ ''విశేషమాక్షర కాలప్రమాణము'' గల ''త్రిపుట
భాపులు''తాళములలో వ్రాయబడినవి. ముత్తుస్వామి దీక్షితుల వారు క్షేత్రయ్య
పదములను పాడుకొని రసానుభవమును పొందుచుండెడివారట. సంగీతవిషయములో
మహాత్మ్యములైన క్షేత్రయ్య పదములను రాగలక్షణములు నిర్ణయించుటలో
త్రిమూర్తుల సంగీత రచనలతో పాటు సంగీత విద్వాంసులు పరిశీలించియున్నారు.
ఈ పదములు విళంబ కాలములో పాడవలెను.

## పదములు — రాగములు

కర్నాటక సంగీతములో కొన్ని వందల రాగాలున్నప్పటికి క్షేత్రయ్య సుమారుగా 40 రాగములకంటె ఎక్కువ రాగములలో పదరచన చేయలేదు. అతనికి మిగిలిన రాగములు రాక కాదు. పదములందు నాయిక, సాత్విక, సంచారములను వికసింపజేయుటకు సంగతులు వేసి పాడుటకు అనుకూలించినట్టి రక్తి రాగములనే ఏరుకున్నాడు. నాయికలు కొన్ని వంద లైనప్పటికి అష్టవిధ నాయికలెట్లు ప్రాముఖ్యంలో పరిగణింపబడుతున్నారో అట్లే రాగములు కూడ అతడు ఏరుకున్నాడు. అంతేగాక ఒక్కొక్క రాగము దాని స్వర సంచారము ననుసరించి, భావసంచారమునకు అనువైనట్టి వాటి యందే ఏరికూర్చాడు. కాని ప్రస్తుత కాలములో కొందరు రాగములు మార్చుట కలదు. దానివల్ల నాయిక స్వరూపానికి భంగము కలుగుచున్నది. సంచారి వికాసానికి ఉపకరించదు. భాషకు రాకపోకడకు అతుకుటలేదు. కనుక వీలైనంతవరకు ఆతడు రచన జేసిన రాగములందే పాడుట ఉత్తమము.

ఉదాహరణ :- ఎటువంటి వాడె వాడు। ఓయమ్మవాడు ఎన్నడు ఈ వీధిని రాడు.

ఈ పదము నీలాంబరి రచన చేయగా కొందరు కళ్యాణిలో పాడు తున్నారు. ఈ నాయికాభినయంలో శృంగారము, అద్భుతము. ఈ రెండు రసాలను పోషింపబడుటకుగాను క్షేత్రయ్య ముగింపు మాటలు, రాగము యొక్క ముగింపుధ్వనికి సరిపోవునట్లు రచన జేసినాడు. ''డు'' -''ట''.

ఈ రెండు అక్షరాలు ఆరాగము యొక్క ముగింపులో కలిసి అంత వైనపుడు ఒక విధమైన ఆశ్చర్యరసోత్పత్తి, తన్మయాభావపుష్టి కలుగు తుంది. కళ్యాణి గాని మరే రాగములో పాడిన ఆ భావస్ఫురణ కలుగదు.

## పదములలో రాగము విలువః-

రాగములయొక్క పరిపూర్ణస్వరూపము పదములయందు కనబడినట్లు, మరింకేయితర సంగీత రచనయందును గోచరించదు. రాగములలోని గంభీరత భావము పదములలోని నాయికలలో ప్రత్యక్షముగ స్ఫురించును. పదములు విలంబితలయలో నుండుటచే ఆరాగములోని అతిసున్నితమైన మధురమైన ధ్వనులను, గూడ ఆ నాయిక యొక్క విరహమో, దుఃఖమో మరి ఏఇతర సంచారీభావముల ద్వారానో ప్రదర్శించుటకు అనుకూలముగ నుండును. ఇట్టి అవకాశము కీర్తనలందు, కృతులందునంతగా కానరాదు.

## పదములు — లయ, తాళములుః-

పదములు విలంబిత లయలో పాడితేనే అభినయం చక్కగా ప్రదర్శించుటకు అవకాశముంటుంది. కొందరు లయపెంచి కీర్తనల పోకడలో పాడుతున్నారు. అది అభినయానికి ఒప్పదు. మరి కొందరు కళాకారులు పదవర్ణములందు నలే తీర్మానాల అడుగులు కూడ పట్టుతున్నారు. అడుగులు, వర్ణములు, జావళీలందు ఒప్పును. అభినయమునందు కేవలము తాళము గతి తెలుపుటకు మాత్రము అడుగులు గాని నర్తకి తనకు కాలిలో గల పాండిత్యము చూపుటకుకాదు.

ముఖంలోని భావపాండిత్యము ముఖ్యంగా అభినయంలో సర్తికి ప్రదర్శించాలి. ఇక కాలిపాండిత్యము నృత్త నృత్యాదులలో చూపవచ్చును. కొందరు కళాకారులు తాళములు మార్చి పాడుదురు.

<u>కొన్ని ఉదాహరణలు: -</u>

రాగభావమును సాహిత్యభావముతో మేళవించినాడు. ''<u>అలిగితే వాడలిగితే</u>'' అను పదములో అరసొంపు మాటలు అనే సొగసైన ప్రయోగముచేసి <u>హుసేని రాగము</u>.త్రిపుటతాళములో రాగము యొక్క అరసొంపును వ్యంగ్యముగ తెలిపినాడు.

''<u>కుటిల కుంతల ముద్దుగోపాలుడట</u>'' వేరు ఎవ్వడేవాడు ఎన్నడు ఈ వీధికి రాడు అనే పదములో <u>నీలాంబరి రాగము</u> ఉయ్యాలలూగుటకు అనుకూలముగ ఉకారాంతమైన వేరు, వాడు, ఎన్నడు, రాడు అను మాటలు ప్రయోగించినాడు.

''కరుణారసపూరితమైన ఏమంటినమ్మ సామి నేమంటినమ్మ అనే <u>తోడి రాగపదములో</u> తగ్గు షడ్జమము దగ్గర గల స్వరములలోనే రాగసంచారము ఉన్నది. ఆ రాగములోనే ''<u>ఏమని మారితివే</u>'' అను పదములో 'నాయక' ను సఖి తీవ్రముగ మందలించు సందర్భమున షడ్జము పద్దగల స్వరములలో సంచారమున్నది. ఇట్లు ఒకరాగములో వివిధ పదములను రాసినప్పుడు భావమునకు తగినట్లు రాగసంచారముచేసి క్షేత్రయ్య సంగీతమునకు మార్గదర్శకుడయ్యాడు.

క్షేత్రయ్య [illegible] సంగీతమునందుగల ద్వాదశస్వరస్థానములను ఉపయోగించి 39 రాగములను రచించెను.

<u>ద్వాదశస్వరస్థానములు:-</u>

| | | |
|---|---|---|
| 1. | షడ్జము | 'ష' |
| 2. | శుద్ధరిషభము | 'శు.రి' |
| 3. | చతుశ్శ్రుతిరిషభము | 'చ రి' |
| 4. | సాధారణగాంధారము | 'సా గాం' |
| 5. | అంతరగాంధారము | 'అం గాం.' |
| 6. | శుద్ధమధ్యమము | 'శు. మ' |
| 7. | ప్రతిమధ్యమము | 'ప్ర మ' |
| 8. | పంచమము | 'పం' |
| 9. | శుద్ధధైవతము | 'శు. ధై' |
| 10. | చతుశ్శ్రుతిధైవతము | 'చ. ధై' |
| 11. | కైశికినిషాదము | 'కై. ని' |
| 12. | కాకలినిషాదము | 'కా. ని' |

# క్లుప్తముగా రాగము యొక్క వివరములు

| క్రమ సంఖ్య | రాగము | ఆరోహణ అవరోహణ | రాగవివరము | స్వరస్థానములు | అన్యస్వరం | పదముల సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 1. | కాంభోజి | సరిగమపదసా సనిదపమగరిస | 28 హరికాంభోజి జన్యము భాషాంగరాగము | ష, ఛరి, అంగాం, శుమ, పం, ఛధై, కైని | కాని. | 37 |
| 2. | కేదారగౌళ | సరిమపనిస సనిదపమగరిస | 28 హరికాంభోజి జన్యము ఔడవసంపూర్ణము | ష, ఛరి, అంగాం, శుమ, పం, ఛధై, కైని | — | 13 |
| 3. | మోహన | సరిగపదస సదపగరిస | 28 హరికాంభోజి జన్యము ఔడవరాగము | ష, ఛరి, అంగాం, పం, ఛధై | — | 12 |
| 4. | సురటి | సరిమపనిస సనిదపమగపమరిసా | 28 హరికాంభోజి జన్యము ఔడవవక్రసంపూర్ణం | ష, ఛరి, అంగాం, శుమ, ఛధై, కైని | — | 4 |
| 5. | ముఖారి | సరిమపనిదస సనిదపమగరిస | 22 ఖరహరప్రియ జన్యము షాడవసంపూర్ణము భాషాంగరాగము | ష, ఛరి, సాగాం, శుమ, పం, ఛధై, కైని | శుధై | 22 |
| 6. | మధ్యమావతి | సరిమపనిస సనిపమరిస | 22 ఖరహరప్రియ జన్యము ఔడవరాగము | ష, ఛరి, శుమ, పం, కైని | — | 10 |
| 7. | హుసేని | సరిగమపమనిదనిస సనిదపమగరిస | 22 ఖరహరప్రియ జన్యము వక్రసంపూర్ణము | ఛరి, సాగాం, శుమ, పం, ఛధై, కైని, ష | — | 8 |

| క్రమ సంఖ్య | రాగము | ఆరోహణ అవరోహణ | రాగవివరము | స్వరస్థానములు | అన్యస్వరం | పదముల సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 8. | సైంధవి | ధ్రదనిసరిగమపదని దపమగరిసనిదనిస | 22 ఖరహరప్రియ జన్యము ధైవతనిషాదాంత రాగము భాషాంగరాగము | ష, చరి, సాగాం, శుమ పం, చధై, కైని | కాని | 5 |
| 9. | కాఫీ | సరిగమరిపమపదనిస సనిదపమగరిస | 22 ఖరహరప్రియ జన్యము వక్రసంపూర్ణము భాషాంగరాగము | ష, చరి, సాగాం, శుమ, చధై, కైని | అంగాం కాని | 3 |
| 10. | శ్రీ రాగము | సరిమపనిస సనిపదనిపమరిగారిస | 22 ఖరహరప్రియ జన్యము షాడవవక్ర సంపూర్ణము | ష, చరి, సాగాం, శుమ, చధై, కైని | — | 2 |
| 11. | భైరవి | సరిగమపదనిస సనిదపమగరిస | 20. నఠభైరవి జన్యము సంపూర్ణరాగము భాషాంగరాగము | ష, చరి, సాగాం, శుమ పం, సుధై శుధై, కైని | చధై | 22 |
| 12. | ఆనందభైరవి | సగరిగమపదప స సనిదపమగరిస | 20. నఠభైరవి జన్యము షాడవవక్ర సంపూర్ణము భాషాంగరాగము | ష, చరి, సాగాం, శుమ, పం, శుధై, కైని | అంగాం చధై, కాని, | 10 |

| క్రమ సంఖ్య | రాగము | ఆరోహణ అవరోహణ | రాగవివరము | స్వరస్థానములు | అన్యస్వరం | పదములు సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 13. | సావేరి | సరిమపదస<br>సనిదపమగరిస | 15. మాయామాళవ<br>గౌళ జన్యము<br>ఔడవసంపూర్ణము | ష, శురి, అంగాం శుమ<br>పం శుద్ధ, కాని. | — | 16 |
| 14. | సౌరాష్ట్ర | సరిగమపదనిస<br>సనిదాపమగరిస | 15. మాయామాళవ<br>గౌళ జన్యము<br>భాషాంగరాగము | ష, శురి, అంగాం శుమ<br>పం. శుద్ధ. కాని | కైని | 8 |
| 15. | మారువ | సగమపనిస<br>సనిదమపమగరిస | 15. మాయామాళవ<br>గౌళ జన్యము<br>ఔడవవక్రసంపూర్ణము | ష, శురి, అంగాం, శుమ<br>పం. శుద్ధ. కాని | — | 2 |
| 16. | నాదనామక్రియ | నిసరిగమపదని<br>నిదపమగరిసని | 15. మాయామాళవ<br>గౌళ జన్యము<br>నిషాదాంత్యరాగము | ష. శురి, అంగాం, శుమ<br>శుద్ధ. కాని | — | 2 |
| 17. | గౌళిపంతు | సరిమపనిస<br>సనిదమపదమగరిస | 15. మాయామాళవ<br>గౌళ జన్యము<br>ఔడవవక్రసంపూర్ణము | శురి, అంగాం, శుమ,<br>శుద్ధ, కాని, ష, పం | — | 1 |
| 18. | గౌరి | సరిమపదస<br>సనిదపమగరిస | 15. మాయామాళవ<br>గౌళ జన్యము<br>ఔడవసంపూర్ణము | ష, శురి, అంగాం, శుమ,<br>పం శుద్ధ, కాని | — | 1 |
| 19. | తోడి | సరిగమపదనిస<br>సనిదపమగరిస | 8. హనుమత్తోడి<br>జన్యము<br>సంపూర్ణరాగము | ష, రిశురి, సాగాం, శుమ<br>పం, శుద్ధ. కైని | — | 15 |

| క్రమ సంఖ్య | రాగము | ఆరోహణ అవరోహణ | రాగవివరము | స్వరస్థానములు | అన్యస్వరం | పదములు సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 20. | ఆహిరి | సరిసగమపదనిస<br>సనిదాపమగరిస | 8. హనుమత్తోడి జన్యము<br>వక్రసంపూర్ణము | ష, శురి, సాగాం, శుమ, పం, శుద్ధ, కైని | — | 6 |
| 21. | పున్నాగవరాళి | నిసరిగమపదని<br>నిదపమగరిసని | 8. హనుమత్తోడి జన్యము<br>నిషాదాంత్యరాగము | కైని, ష, శురి, సాగాం, శుమ, పం, శుద్ధ, కైని | — | 8 |
| 22. | ధనాసి | సగమపనిస<br>సనిదపమగరిస | 8. హనుమత్తోడి జన్యము<br>ఔడవసంపూర్ణము | ష, శురి, సాగాం, శుమ, శుద్ధ, కైని | — | 4 |
| 23. | ఆసావేరి | సరిమపదస<br>సనిసపదమపమగ్గా రిస | 8. హనుమత్తోడి జన్యము<br>ఔడవవక్రసంపూర్ణము<br>భాషాంగరాగము | ష. శురి. సాగాం. శుమ. పం. శుద్ధ. కైని | చరి | 3 |
| 24. | బిలహరి | సరిగపదస<br>సనిదపమగరిస | 29. ధీరశంకరాభరణ జన్యము<br>ఔడవసంపూర్ణము<br>భాషాంగరాగము | ష, చరి, అంగాం, శుమ, పం, చద్ధ, కాని | కైని | 11 |
| 25. | శంకరాభరణము | సరిగమపదనిస<br>సనిదపమగరిస | 29. మేళకర్త రాగము<br>సంపూర్ణరాగము | ష, చరి, అంగాం, శుమ, పం, చద్ధ, కాని | — | 9 |
| 26. | బేగడ | సగరిగమపదపస<br>సనిదాపమగరిస | 29. ధీరశంకరాభరణ జన్యము<br>వక్రషాడవసంపూర్ణము<br>భాషాంగరాగము | ష, చరి, అంగాం, శుమ, పం, చద్ధ, కాని | కైని | 5 |

| క్రమ సంఖ్య | రాగము | ఆరోహణ అవరోహణ | రాగవివరము | స్వరస్థానములు | అన్యస్వరం | పదముల సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 27. | నవరోజ్ | పదనిసరిగమప<br>మగరిసనిదప | 29. ధీరశంకరాభరణ జన్యము<br>పంచమాంత్యరాగము<br>భాషాంగరాగము | ష, ఛరి, అంగాం, శుమ, పం, ఛధై, కాని | కైని | 5 |
| 28. | నీలాంబరి | సరిగమపనిస<br>సనిపదనిపగమగస | 29. ధీరశంకరాభరణ జన్యము<br>షాడవ, ఔడవరాగము | ష, ఛరి, అంగాం, శుమ, పం, ఛధై కాని | కైని | 4 |
| 29. | కన్నడ | సమగమపమదానిస<br>సనిసదపగమదపగమ రిస | 29. ధీరశంకరాభరణ జన్యము<br>షాడవ, వక్రసంపూర్ణ<br>భాషాంగరాగము | ష, ఛరి, అంగాం, శుమ ఛధై కాని | కైని | 4 |
| 30. | అఠాణ | సరిమపనిస<br>సనిదపమగారిస | 29. ధీరశంకరాభరణ జన్యము<br>ఔడవవక్రసంపూర్ణము<br>భాషాంగరాగము | ష, ఛరి, అంగాం, శుమ, పం, ఛధై, కాని | కౌ కైని, సాగా | 4 |
| 31. | కేదార | సమగమపనిస<br>సానిపామగారిస | 29. ధీరశంకరాభరణ జన్యము<br>ఔడవ, షాడవరాగము | ష, ఛరి, అంగాం, శుమ, పం, కాని | — | 1 |
| 32. | ఘంటారవము | సరిసగమపనిస<br>సనిదపమగరిస | 2వ మేళకర్త రత్నాంగి జన్యము<br>వక్రషాడవసంపూర్ణము | ష, శురి, శుగాం, శుమ, పం, శుధై, కైని | — | 13 |

# క్షేత్రయ్య పదములందు చతుర్విధాభినయములు

'అభినయము' అనే పదంలోని 'అభి' అనే ఉపసర్గకు 'అభిముఖంగా' అని. 'నీ' [illegible] = నీ = నయతి అనే ధాతువునకు 'పొందించటం' లేదా 'తీసుకొనిరావటం' అని అర్థాలు. అంటే రూపకార్థములను సామాజిక హృదయాలకు అందచేయటం అని అభినయ పదమునకు అర్థం. ఈ అభినయం నాలుగు విధాలు — 1. ఆహార్యాభినయం, 2. ఆంగికాభినయం, 3. వాచికాభినయం, 4. సాత్త్వికాభినయం.

మానవుని నిత్యజీవితములో ప్రారంభదశలో పసిపాప చిరునవ్వు మొదలు కాని ప్రతి విషయము ఒక సన్నివేశమై అభినయము గోచరించును.

ఉదాహరణకు:- తల్లి తన పాపకు స్నానము చేయించి పాపాకు సాంబ్రాణి పొగవేసి చక్కగ నుదుట తిలకము దిద్ది బుగ్గన చుక్క పెట్టి కనులకు కాటుకదిద్ది తెల్లని వస్త్రములలో అలంకరించి నిదుర బుచ్చును. [illegible] జోలపాటతో ఆహార్యాభినయము గోచరించును.

కొంతసేపటికి పసిపాప నిదురనుండి మేలుకొని తన తల్లికోసమై కనులతో వెతకును తల్లి కానరాక దుఃఖించును. తల్లి [illegible] తల్లడిల్లును. తన తల్లిని చూచిన వెంటనే చిరునవ్వులతో కాళ్ళు, చేతులను ఆనందంతో ఆడిస్తూ, [illegible] తల్లి ఒడిని చేరుకొని [illegible].

ఈ సన్నివేశములో తల్లి కొరకు దుఃఖించుచు పాప ఏడుపులో వాచికాభినయము, కాళ్ళు, చేతులను ఆడిస్తూ ఆనందముతో పైకి తన చేతులను చూపుతూ ఉండడము ఆంగికాభినయమును చిరునవ్వుతో సాత్త్వికాభినయమును గమనించవచ్చును. అభినయము జీవితములో సర్వసామాన్యము.

ఆహార్యాభినయము :-

'ఆహార్య' మనగా తెచ్చిపెట్టుకొన్నది అని అర్థము. దీనినే నేపథ్య సంబంధమైన విధిలేక వేషధారణము అందురు. (వేషధారణమునకుపయుక్తమగు నాట్యశాల భాగమును నేపథ్య గృహమందురు.)

నాట్యమందలి నైపథ్యము లేదా నేపథ్యజమైన విధి 4 విధములు.

1. పుస్తము. 2. అలంకారము. 3. అంగరచన. 4. సంజీవము.

పుస్తకము అనగా శైల, యాన, విమానాదులు; పదర్శనార్థము నాట్యరంగమునందు నిర్మింపబడును.

మాల్య, ఆభరణ, వస్త్రములను నానా విధములుగా అంగోపాంగ ప్రత్యంగము లందు యథోచితములుగా అలంకరించుకొనుట అలంకారము.

స్వభావ వర్ణములు, సంయోగజవర్ణములు, ఉపవర్ణములు, అను విధములచే వర్ణములు మువిధములు. యథోచితములగు వర్ణములలో నటులు తమసహజ రూపములను అచ్ఛాదించుకుని, రూపకగత పాత్రలయందు లీనమై ఉండుట 'అంగరచన' అగును.

పశుపక్ష్యాదుల రంగప్రవేశము సంజీవము. నిజమునకు సాత్త్విక – ఆంగిక – వాచికాభినయముల కంటే కూడ ఆహార్యాభినయము ముందుగా పేర్కొనదగినది.

నటుడు రంగస్థలమునందు ప్రవేశింపగనే ప్రేక్షకులకు ప్రధానముగ ఆకర్షించునది వాని ఆహార్యమే. పిమ్మట చేష్టలు, మాటలు, తరువాత భావ ప్రదర్శనము ఆకర్షించును.

<u>ఆంగికము ( శారీరాభినయము)</u>

లోకము నందు ఎవరైనను సవిలాసముగ నడచినచో 'నాటకము ఆనుకుంటున్నట్లున్నారు కాబోలు ' అని వెక్కిరించుటయో లేదా, ఆ నడక అందంగా ఉంది అని మెచ్చుకొనుటయో చేయుచుందుము. ఆనందమున కాని, కోపమును గాని, దుఃఖమునగాని, పట్టజాలనప్పుడు చిన్నలేకాదు పెద్దలును చిత్రవిచిత్రములైన అంగవిన్యాసములు చూపుచుందురు. ఇవన్నియును అభినయమునందు ఆంగికాభినయమునకు మూలరూపములు.

మానవుని శరీరమునందలి అవయవములన్నియును అంగ, ఉపాంగ — ప్రత్యంగములుగా త్రిధావిభక్తములై యున్నవి. శిరస్సు, హస్తములు, కటి ఉరము, పార్శ్వములు, పాదములు అను ఆరును అంగములు.

నేత్రములు, కనుబొమలు, నాసిక, అధరము, కపోలములు, చిబుకము అను ఆరును ఉపాంగములు.

జఘనము, జంఘలు, ఊరువులు, స్కంధములు, బాహువులు, పృష్ఠము, గ్రీవము, మణిబంధములు, జానువులు, కూర్పరములు అనునవి ప్రత్యంగములు. ఇవి పరస్పరము సంబంధము కలిగి ఉన్నవి. మానవుడు ఏదేని భావమును ప్రదర్శించినచో లేదా ఏదేని చలనమును చూపినచో, ఈ అంగోపాంగ ప్రత్యంగములన్నియును కాని, కొన్నికాని కలిసియే కదలుచుండును.

వాచికాభినయ ప్రాధాన్యము

వాచియత్నస్తు కర్తవ్యో నాట్యస్యేషా తనుఃస్మృతా
అంగనైపథ్య సత్వాని వాక్యార్థం వ్యంజయంతిహి,
వాఙ్మయానీహ శాస్త్రాణి వాఙ్నిష్ఠాని తథైవచ ।
తస్మాద్వాచః పరం నాస్తి వాగ్ఘి సర్వస్యకారణమ్ ॥

— వాక్కు నాట్యమునకు తనువు కావున దానిని గూర్చి అధికమగు శ్రద్ధను తీసుకొనవలెను. ఆంగిక, ఆహార్య, సాత్త్వికాభినయములు మాడును వాక్యార్థమునే అభివ్యక్తము చేయును. సమస్త శాస్త్రములు వాక్స్వరూపములే అంతియేకాక వాఙ్నిష్ఠములు కూడును. కావున వాక్కున కతీతమైనది వేరొకటి లేదు. వాక్కే సమస్తమునకు కారణము.

నామములు, ఆఖ్యాతములు (క్రియలు), నిపాతలు, ఉపసర్గలు, తద్ధితములు, సమాసములు, సంధులు, విభక్తులు అనువాని జ్ఞానము వాచికాభినయమందు ఆవశ్యకము. భాషా భేదములు, వ్యాకరణము, ఛందస్సు, లక్షణములు, అలంకారములు, గుణములు, దోషములు, సంబోధనపద్ధతి, నామకరణ విధానము, కాకుస్వరవ్యంజనము విరామము – ఇవి వాచికాభినయ ముందలి అంశములు.

## వాచికాభినయము 12 విధములు.

1. ఆలాప
2. ప్రలాప
3. విలాప
4. అనులాప
5. సంలాప
6. అపలాప
7. సందేశ
8. అతిదేశ
9. నిర్దేశ
10. వ్యపదేశ
11. ఉపదేశ
12. అపదేశము.

1. ఆలాపము:- ఎదుటి వ్యక్తితో మధ్యమపురుషలో ఉపదేశరూపముగ మాటాడుట 'ఆలాపన' మగును.

2. ప్రలాపము:- అనర్థక వాక్యములను పలుకుట.

3. విలాపము:- కరుణరస సంబంధమైన వాక్యము.

4. అనులాపము:- ఒకే వాక్యమును పలుసార్లు చెప్పుట.

5. సంలాపము:- ఉక్తి - ప్రత్యుక్తి సహితముగు సంభాషణము.

6. అపలాపము:- ముందు చెప్పిన మాటను మరియొక విధముగ మార్చి చెప్పుట.

7. సందేశము:- ఈ మాట వానితో చెప్పుదము. మున్నగు వాక్యముల 'సందేశము'.

8. అతిదేశము:- నీవు చెప్పిన దానిని నేను చెప్పితిని.

9. నిర్దేశము:- ఆయా నేను మాటాడుచున్నాను అనుచు తన్ను తాను నిర్దేశించుకొనుట.

10. నుపదేశము:- ఏదేని ఒక వ్యాజముతో మాటను చెప్పుట.

11. ఉపదేశము:- 'ఇది చేయుము', 'తీసుకొనుము' మున్నగు వాక్యములను చెప్పుట.

12. అపదేశము:- తాను చెప్పదలచిన దానిని "ఇట్లు అతడు చెప్పు చున్నాడు". అని ఇంకొకడు చెప్పినట్లు చెప్పుట.

4. సాత్వికాభినయము:-

సత్త్వసంబంధమైన అభినయము సమాహితమైన అనగా స్వవశమందున్న మనస్సు వలన పుట్టిన విశేష స్థితియే సత్త్వమనియు, మనస్సమాధి లేదా ఏకాగ్రత అని చెప్పవచ్చును. ఈ సత్త్వ సాహాయ్యమున ప్రదర్శింపబడుటచేత రోమాంచాదులు సాత్త్వికభావములనబడినవనియు భరతముని పేర్కొనెను.

పరగత సుఖ దుఃఖ భావనచే భావితమై అంతః కరణము సత్త్వములనబడును. అని ఆర్యాచీనులు పేర్కొన్నారు. అతిగా కోపము వచ్చినచో ముఖము కందగడ్డవలె ఎర్రనగును. అతిగా భయాదులు కలిగినచో ఒడలంతటను చెమట పట్టును. వణకుపుట్టును. అంతరంగమున పుట్టిన భావతీవ్రత వలన శరీరమునందు కన్పట్టు ఈ మార్పులే సాత్వికాభి నయమునకు మూల రూపములు. క్షేత్రయ్య పదములందు ఈ చతుర్విధాభి అభినయములు నవరసములతో కూడుకుని చక్కటి హృదయంగమభావము పదములందు స్పష్టముగా కనిపించును.

# నవరసములు

"యతో హస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో మనః
యతో మనస్తతో భావో యతో భావస్తతో రసః ॥.

హస్తము యెటువైపుకు జూపబడునో అక్కడికి దృష్టిప్రసరించవలెను. ఎచ్చట దృష్టియుండునో అచ్చట మనస్సు, ఎచ్చట మనస్సుండునో అచ్చట భావముపుట్టును. భావమున్నచోట రసము పుట్టును.

ఏదేని ఒకదృశ్యము చూచునపుడు మన హృదయమునందు కలుగు మార్పుభావము ఆభావమునందే రసము పుట్టుచున్నది.

ఉదాహరణ:- స్త్రీ,పురుషులలో కలుగు సంభోగచింత రతి అనబడును. రతియొక్క స్థాయి భావమే, శృంగార రసమనబడును. అనగా రతి యనెడి కోరికవలన పుట్టినది శృంగారరసము.

నవరసములు:-

1. శృంగారరసము. 6. భయానకరసము.
2. వీరరసము. 7. భీభత్సరసము.
3. కరుణారసము. 8. రౌద్రరసము.
4. అద్భుతరసము. 9. శాంతరసము.
5. హాస్యరసము. 10.

[illegible] క్షేత్రయ్య పదములందు అష్టవిధనాయకులలో వివిధ సన్నివేశములలో కొన్నిరసములు కనబడును.

" ' అష్టవిధ నాయికా నిరూప్యంతే

స్వాధీన పతికా చైవ తథా వాసక సజ్జికా

విరహోత్కంఠితా ప్రోక్తా, విప్రలబ్ధాచ ఖండితా

కలహాంతరితా చైవ తథాప్రోషిత భర్తృకా,

తథాభి సారికా చైవ ఇత్యష్టధా నాయికా మతః

1. <u>స్వాధీనపతికా:-</u> నాయకునిచే నెల్లప్పుడు సంతోషపరప పడేది నాయిక.

<u>ఉదాహరణ పల్లవి:-</u> ఎందుకురా కోపము మదన జనక ఏమి

మనసును దోచె

<u>చరణము:-</u> గ్రక్కున నను నీకౌగిట జేర్చగ చక్కని

మోవి చురుక్కున నొక్కని ।।ఎందు।।

ఈ పదమునందు శంక, వితర్కము, దైన్యము, ఉగ్రత మొదలగు సంచారి భావములు యిమిడి యున్నవి.

<u>వాసవిక సజ్జిక:-</u> ప్రియుడొచ్చెడి సమయమునందు, తాను అలంకరించుకొని కేళీ గృహమును అలంకరించి సిద్ధముగ నుండునేది వాసిక సజ్జిక.

<u>ఉదాహరణ:-</u> ఇంతపొద్దాయెనే ఇంక వాడేమి వచ్చేని?

అని, చింతింప పనిలేదు చెలియ మువ్వగోపాలుడు

ఈ పదమునందు నాయిక నాయకునిక్కై ఎదురు చూచుచు నాయిక నిరుత్సాహము నొందుచున్నది.

3 విరహోత్కంఠితః- నిరపరాధి అగు ప్రియుడు రాక, జాగు చేయక కాలవిలంబము నోర్వక ఎదురు చూచుచుండ నాయిక విరహోత్కంఠిత.

ఉదాహరణః- వదరక పోవే వాడేల వచ్చేని,

వదుꣳ రావద్దనవే, కూడియున్నది చాలునే

ఈ పదమునందు నాయిక నాయకుని రాకక్కై ఎదురు చూచి, విరహ బాధను, విరక్తితో తెలియ జేయుచున్నది.

4. విప్రలబ్ధః- ఏదైన ఒక నిర్దిష్టమైన చోటుని సంకేత స్థానముగ చెప్పి అక్కడ నాయకునిచే వంచింపబడి అనగ అతడు అక్కడికి రాకపోగ మనోవ్యధ పీడితురాలై యుండునది విప్రలబ్ధ.

పల్లవిః- ఈ మేను జీవునకు ఎంతప్రియమాయెను.

అనుపల్లవిః - భామా మామువ్వగోపాలు కౌగిటలేని.

5. ఖండితః- సంకేత సమయమునతిక్రమించి అన్యోపభోగపు గురుతులతో ప్రాతః కాలమందు వచ్చెడి నాయకుని గలది ఖండిత నాయక అనబడును.

పల్లవి. ఉదాహరణః- ముందటి వలె నాపై నెనరున్నదా? నాసామి।

అపుడ్చుట నికనేలరా?

అనుపల్లవిః- ఎందుకు మొగ మిచ్చకపు మాటలాడేవు ఏరా।

మువ్వగోపాల నాసామి.

6. కలహాంతరిత :- సఖుల ఎదుట చరణపతితుడగు నాయకుని నిరాక రించి పిదప పరితాపపడునది. కలహాంతరిత అనబడును.

ఉదాహరణ :- తెలివి యొకరిసొమ్మా? యొందుకే విభుని తిరుగ పొమ్మంటివమ్మా

7. ప్రోషిత భర్తృక :- నాయకుడు దేశాంతరమును జెందియున్నపుడు ఖేద పడుచున్నది. (ప్రోషిత భర్తృక)

ఉదాహరణ :- ఎన్నటికో నాకొమ్మను జూచేది ఎన్నటికో నా మనసు చల్లనయ్యేది. వన్నెలాడి బన్నిసరులు నాయురమున్నే నుండగా నేను ఉపతతి గలిసేది. ఈ పదము యందు నాయక ప్రోషితపతి దేశాంతరము నందు నాయకను తలచుకున్నాడు.

8. అభిసారిక :- మదనానల సంతప్తయై తన స్థలమునకు నాయకుని వచ్చునటుల చేయునది గాని, తానే నాయకుని స్థలమునకు బోవుచున్నది ఇదియే అభిసారిక అనబడును.

ఈ విధముగా క్షేత్రయ్య పదములందు అభినయము నవరసాలతో కూడుకొని అష్టవిధ నాయకులతోను, సంచారీ భావములు గోచరించును.

# క్షేత్రయ్య పదములందు సాహిత్యము

క్షేత్రయ్య పదములు సర్వలక్షణములతో మువ్వగోపాలునికి అంకితములు. వివిధ నాయకుల అనుభవమును నిరూపించు మువ్వపదావళి. నాయికా ప్రధానకము. నాయకుడొక్కడే మువ్వగోపాలుడు. అతడే వరదుడు, వేంకటేశుడు, అనంతుడు అనంతరూపచక్రవర్తి. నాయికానాయక అనుభవభావవిలాసములిందున్నవి. ఆభావదృష్టిలో ఆ గోపాలనాయకుడొక్కడే అయినను అనంతడు వివిధ నాయికల భావపరివృతుడై గోచరించును. కావుననే యందలి లక్షణములన్నియు నాయికానాయక భేదములకు ఉదాహరణములు.

క్షేత్రయ్య పదములందు దశ, సహస్రాధిక, స్త్రీ పరివేష్టిత మోహనాకారుడు శ్రీకృష్ణుడు. అతని అనంతలీలా విశేషములు నాయిక యందు నాయకుని భావము అనేకవిధములుండును నియమితమైన దాంపత్యధర్మము గోచరించును.

ఈ పదములు శృంగారపదములు. ఇదిలోకప్రసిద్ధి. ఈ కావ్యము శృంగార కావ్యము. ఈ శృంగారము నందు భేదములు కలవు. 1. సంయోగ శృంగారము 2. వినియోగ శృంగారము. రెండింటికి అనంత భేదముంది. కవులు వినియోగ శృంగారమును ఎక్కువగ వర్ణింతురు. దీనియందు ఎంతయో ప్రతిపాద్యమున్నది. సంయోగ శృంగారమునకు పుష్టి లేదు. ఈ పదములలో కొన్నిటియందు నాయక కథనము, మరికొన్నిటి దూతీ కథనము అధిక సంఖ్యాకములందు నాయికా కథనము కలదు. ఏ కథనములో కాని పరిపూర్ణ శృంగారసామాగ్రి యున్నది.

" విభావాను భావవ్యభిచార సంయోగాత్ రసనిష్పత్తిః "

— అని భరతుని శాస్త్రము.

— ఇందే స్త్రీ, పురుషుల యనోన్యాను భావగతి అది సుస్థిరమగుచున్నాయి.

నాయకుడింపు శ్రీకృష్ణుడు. అతని విషయమై ఆయా నాయికకు అను

రాగముకలది. ఆయానాయిక యందును మువ్వగోపాలుడు రతి

చిత్తము గలవాడు.

ప్రతిపదమునందు ఒక విశిష్టమైన శృంగారకావ్యమగుటచే నాయిక

గోపాలరతి కలిగియున్నది. ఆ సమయము నందు ఆ నాయిక మనసులో

అన్యరాగము లేదు. అనేకప్పటి విరుద్ధ భావావేశము లేదు. అందుచే ఆయా

నాయిక ఈస్థాయిక్షతమగును. అట్టిస్థాయి భావరతి క్షేత్రంయ్య పదము

నందు రసీకృతమైయున్నది.

పదములందు ఎటుచూచిన భావములు పుష్కలముగా గనపడును.

బాహ్యములైన యనంతరూప విశ్లేషములు రమణసుందరములై కూర్పు పొందు

నవి. ఆయా నాయకుల రూప విలాసాది సంపదలు కూడ సుశిష్టములై

వున్నవి. వీనైన ఆలలిత నాయకులు, నాయికల హావ, భావాది, శృంగార

విలాసములు, నానా మధురు చేష్టలు అనుభవీకృతములై యనుభవమున

ముద్రితములే అగుచు ఆమె స్థాయి రతి సాగరములో ఆమోదములు,

శంకాదులు, ఉత్సాహములు, అలీనములై అనితర శోభనిచ్చుచునే యున్నది.

నానావిధముల వివశీకృతచిత్తములైన వారి సాత్త్వికముల స్థితి వేరుగా వెరిగింప

నక్కరలేదు.

వీని వలన కలిగిన స్థాయి, సమస్తేషము శృంగారరసమ్మె అన్ని పదము లందును పద్యాదులకు ధర్మముగా మనగనునేయున్నది. ఇట్టి రసభావ సిద్ధి యీ ముక్తకము లందంటను సులభ గ్రాహ్యము. ఇట్లు సమీక్ష రించి భావించినచే నందలి యోపాద సుందరతక్షేత్రజ్ఞునకు సాహిత్యతను సుస్థిరము చేయును.

సిసిమోగ పరితప మైన నాయిక హ్యాదయము విలక్షణ శోభా వర్ధనము. అది యిటున్నది. పురుష విరహము నిరూపించబడున్నది. నాయిక విరహము నిరూపణముయు అధికములు. ఇందలి నాయికలు, కన్యలు, ముగ్ధలు, మధ్యలు ప్రౌఢలు, ధీరలు, అధీరలు, ధీరా ధీరలు, జ్యేష్ఠలు, కనిష్ఠలు, స్వాధీనపతికాది విశేషము కలవారు.

క్షేత్రయ్య పదములోని మువ్వగోపాలుని నాయిక మువ్వగోపాలుడు కానరాకపోయినచో ఏమైనాడని తలచును. కోపముతో అతనిని ఇష్టము వచ్చినరీతిలో మాటలు అనగలదు. ఇది అసాధారణమైన తెలుగుమంట. శృంగార పరిపూర్ణమిందు మాత్రమే కానగును కేవలం క్షేత్రస్తుతికాదు. స్త్రీ కర్తృత్వము, పురుషకర్తృత్వములయిన శృంగార భేదములిందు సూక్ష్మముగా భావింపతగియున్నవి.

'' మోము, మోమున జేర్చుకొని కన్నుల కొత్తన్,

ముద్దు పెట్టు కొన్నాడే. ఇవి అనేకములు కలవు.

'' నానా కథనమేల అనుకూలుడైనట్టి మగవాడు కలిగితే ''.

అను కాంభోజిరాగము. వీనియందు స్త్రీ కర్తృత్వము బహుళముగ నున్నవి. విరహావ్యవస్థలో పురుష కర్తృకములను వారు భావించి, యూరట పొందుదురు. అప్పటిలో వారికది యూశ్వాసము. భావ్యమాన శృంగారము సమ కాలములో విరహ దీపమిచ్చినను ఆదియొకంమోదార్హగ తాత్కాలికముగ స్త్రీలు సంతుష్టులగుదురు.

''ఆడపగత్తె వాని పంటిద్దె తేచాలు''.

— ఈ పదములో తన చెలియతో చెప్పు నాయికా భావనము వేషముయోగ పరిపాకమును సూచించును. నాయకుడగు మువ్వగోపాలుడు అటు తిరగనీ, యిటు తిరగనీ ఆతనిష్టే నాయికల వలపు లక్ష్యశుద్ధి కలిగి చిలువల పలువుల వేయును. అందుకే నాయకుడు సర్వవిధ శృంగార నాయక స్వభావము కలిగియున్నట్లు వర్ణితమయినది. విశ్లేషించి జ్ఞాత, జ్ఞాతములుగా నున్న నితన్నెవిత్తి కాదిరాగములు క్షేత్రయ్య పదదర్పణములో చుంబించి యున్నవి. ఈ విధముగ మువ్వగోపాలుని మువ్వలను మ్రోగించి ధ్వని తేజమును గుర్తించవలెను.

క్షేత్రయ్య నాయికలయాసక్తి భావనేత్రముతో చూసినాడు. బాహ్యాభ్యంతర రతులు బాహ్యభేదములైన ఆలింగన చుంబన దశ నక్షత్ర ఘట్టనాదులనంత భేదములు అభ్యంతర రతులలోని బాధగతుల పురుషాయితర సమానీచాదిరతులు అన్నియునిందున్నవి.

వేశ్యలు విద్యా, విజ్ఞానరూప సంపదవేత్తలు. దేవదాసీత్వము పొంద మధుర భక్తులై దేవళమున అభినయించినారు.

వారు సర్వవిధ నాయికలయినారు. మువ్వగోపాలుడే స్వామి భవితమని అభినయమున వారు నిరూపించిరి.

సగ్నానుభవ కాముడైన కృష్ణగోపాలునకు ఆనందమును కలుగ చేయుటయే తమకు సంతోషము. ఇట్టి దేవదాసి చిరకన్యలను క్షేత్రజ్ఞుడు పరమనేత్రములతో చూసి వారలను గోపికలుగా చిత్రించినాడు. సర్వామయ సుందరులయిన దేవదాసీలచతుర, చతురాభినయములు చూసి భావించి నాట్యరసజ్ఞుడైన, సాహిత్యక క్షేత్రయ్య తనయందే నాయికత్వ మూపాదించుకొనినాడు. అచలాయితమైన పురుష చిత్తవృత్తి యిట్లుండును. కేవలమూ నాయికత్వము భావించుటతో తృప్తిపడక దేవదాసీత్వమాపాదించుకొని కృష్ణప్రియతమము భావించుకొని ఆత్మనివేదనాత్మకమయిన తుది భక్తిని పదాలతో స్వరూపము చేసి క్షేత్రయ్య క్షేత్రజ్ఞుడగును. ప్రతి పదము నందు క్షేత్రస్వామి భక్తి పరత్వము చూపును. ఒక్కొక్క దినమొక్కక్క పదమునాతడు రచించి, భావములో పూర్ణసాక్షాత్కారము పొంది క్షేత్రయ్య పదరచన చేసి యుండును.

ఈ మువ్వపదాలలో చతుర్విధాత్మక నాట్యము స్పష్టసమన్వయము పొందును.

''వగవ తన కేళికామందిరము వెడలె'' అని భావించినపుడు ఊహపదమున చేసి ఆహార్యాభినయ భూషితమయిన రూపము సాక్షాత్కరించును. లాస్యతాండవ రంజితమైన అంగ, రంగ ప్రత్యంగ స్పందములతో కూడిన ఆంగికాభినయమున్నది. ఈ పదమునందు సాత్వికాభినయము ఆత్మవంటిది.

క్షేత్రయ్య తెలుగు భక్తుల భక్తి పంట పొలము తన హృదయము కేదారమునందు లక్షణమధురభక్తి సస్యములన్నిటిని పండించినాడు. వైష్ణవా లంకారికులు మధుర శృంగార భక్తిలో ప్రసారము పొందిన గతి ప్రగతు లన్నియు క్షేత్రయ్య పదాలలో గోచరించును.

గీతగోవిందములో నాయకుల శృంగారలీలలు ప్రముఖమధురములైనవి. అవి వారి ప్రేమ విలాసము, ప్రేమ భక్తి గతిరమ్యత. ఆప్రేమరసము స్రవించి భక్తిలో పర్యవసానము పొందును.

<u>ఉదాహరణ:-</u> గోపి విరహములో కృష్ణవేదనలకన్న కృష్ణ విరహములో గోపి వేదనలు అత్యంత సుకుమారములు.

క్షేత్రయ్య ఎన్ని దేవుళ్ళను చూచినను క్షేత్రయ్య నాయకకు మువ్వగోపాల దృష్టిమారలేదు. గోపాలదేవుడు వీరపురుషుడు క్షేత్రయ్య నాయిక వీరనారి. అలౌకికమయిన ప్రేమ భక్తపరిపాక మయుదయించినపుడు ధ్యేయము దేవియయినచో వీరనారి అగును. దేవుడయినచో వీరపురుషుడు అగును. క్షేత్రయ్య వీరనాయికమ్మై పదముపాడెను. మానవ శృంగారము భక్తి శృంగారము రెండును పదములందు ఇమిడి ఉన్నది.

మానవ శృంగార రచనవలన ప్రేమ భావములోని విభిన్నరూపముల వర్ణనకు నూతన, సౌందర్య సృష్టికి నవకాశము కలిగినది.

భక్తిశృంగారములో భక్తుని ఆత్మ భగవానునిలో ప్రతి భావమునను సరించి భక్తిప్రదర్శించును భగవానుడు భోక్త, చరాచరము భోగ్యము.

జనంయందు భాగ్యదృష్టియున్ననే భగవంతునియందు భోక్తృత్వము సిద్ధమగును. కా: భక్తిలో జీవాత్మకు సంభోగమందు ధ్యేయము చిర సంభోగమునకై వేదమార్గమున సహకరించును. క్షణకాలమైనా విరహ సహనముండదు. అద్వైత మనస్త్వము, క్షేత్రయ్య క్షణమైన విరహము సహింపజాలని నాయకనాయికుడు.

క్షేత్రయ్య సాహిత్యమునకొక విశిష్టత కలదు. హితములు హితకారులయిన నాలుగు అభినయముల సామరస్యము నాట్యము, నాట్యమే సాహిత్యము శబ్దము శక్తి, అర్థము శివుడు, శివశక్తి శబ్దార్థసాహిత్యము ఆది దంపతుల నిత్యశృంగారము సాహిత్యములోనున్నది.

క్షేత్రయ్య పురుష సౌందర్యము ముఖ్యము చేసి స్త్రీ విరహము నిట్లు నిరూపించెను. మధురగోపాల కృష్ణసంయోగమునకు కాంక్షపడు క్షేత్రజ్ఞుడు విరహాపరితప్తాత్ముడై యిట్లు మంజుల మధురభావము కల వాడగుట సాహిత్యవేత్తు యోగులకందరకు లలిత మధుర మార్గము లభించినది.



# నృత్య, సంగీత, సాహిత్యవివరణ

క్షేత్రయ్య పదములందు అభినయము, సంగీతము, సాహిత్యముల గురించి తెలుసుకున్నాము. ఇపుడు ఈ క్రింది పదము ద్వారా ఎలా ఈ మూడు భాగాలు ఇమిడి ఉన్నాయో తెలుసుకుందాము.

## ఆనందభైరవి — ఆదితాళము

'' శ్రీపతి సుతు బారికి నే — నోపలేక నిను వేడితే

కోపాలా? మువ్వగోపాలా!

ఏపాటిదు దానింటిలోనే — కాపై యుండి నీ సరస స

ల్లాపాలా? మువ్వగోపాలా ! ||శ్రీపతి||

మై పూతమాటల నేరచి — జూపు దాని రతిపై నింత

తాపేలా? మువ్వగోపాలా ! ||శ్రీపతి||

చూపులనన్నులదేరి — చూచినాతో క

లాపాలా? మువ్వగోపాలా ! ||శ్రీపతి||

నాపొందెల్ల దానికబ్బి — యేపొందులేక యుసురనుటే

నాపాలా? మువ్వగోపాలా ! ||శ్రీపతి||

<u>రాగలక్షణము:-</u> ఇది 20 వ మేళకర్తయగు నఠభైరవి జన్యము. ఇది 'వేద' అనెడి 4వ చక్రములోని 2వ మేళకర్తరాగము. షాడవవక్ర సంపూర్ణము. త్రిస్వరఅన్యస్వరభాషాంగరాగము.

ఆరోహణ:- సగరిగమపదపస
అవరోహణ:- సనిదపమగరిస

<u>స్వరస్థానములు:-</u> షడ్జము
చతుశ్శ్రుతి రిషభము
సాధారణగాంధారము
శుద్ధమధ్యమము
పంచమము
శుద్ధధైవతము
కైశికనిషాదము.

<u>అన్యస్వరములు:-</u> అంతరగాంధారము.
చతుశ్శ్రుతిధైవతము.
కాకలినిషాదము.

<u>అన్యస్వరమైన గాంధార ప్రయోగము:-</u>

" గా మపమమా – మగరిగామా – మగామా – పమగగమా "
అనునప్పుడు అంతరగాంధారము పలుకును.

<u>ధైవతప్రయోగము:-</u> ధైవతము ఆరోహణ, అవరోహణలయందే వచ్చును.

మరియు ఎక్కువగా అన్యస్వరమైన ధైవతము వచ్చును.
" రిసనిద – దనిదప – పాదని – దనిప " మొదలగు ప్రయోగము

లలో అన్యస్వరమైన చతుశ్శ్రుతిధైవతము పలుకును.

స్వకీయ స్వరమైన శుద్ధధైవతము 'పదపమ మపదప'

అను ప్రయోగములలో మాత్రమే వచ్చును.

కాకలినిషాదము:- ఈ రాగమునందు కాకలినిషాదము ''సనిసా – సనిదనిసా'' అను ప్రయోగములలో వచ్చును.

రాగచరిత్ర:- ఆనందభైరవి మిక్కిలి ప్రాచీనరాగము. ఇది షడ్జగ్రామ రాగము. ఎందువలనంటే రిషభ, గాంధార, ధైవత, నిషాదములు ''త్రిశ్రుతిరిషభము, కోమలి సాధారణగాంధారము, శుద్ధమధ్యమము, త్రిశ్రుతిధైవతము, మరియు కోమలికైశికినిషాదము'' షడ్జ గ్రామస్వరములు. కాని ఆస్వరములుకూడ ఈరాగము సం[illegible] జానపదగేయములనుండి తీసుకొనబడినవి.

ఆనందభైరవిరాగములో త్రిశ్రుతిధైవతము పరిమాణములో పలుకుచున్న చతుశ్శ్రుతిధైవతమునకే ఎక్కువ అవకాశము. ద్విశ్రుతిధైవతమగు శుద్ధధైవతము '<u>పాదపా</u>' – '<u>మదపపా</u>' – '<u>గమపదాదగా</u>' అను ప్రయోగములలో కనిపించుచున్నది.

ఈ ప్రయోగములలో <u>గమపదదాగా</u> అను ప్రయోగములో శుద్ధధైవతము తప్పకవచ్చును. మొదటి రెండు ప్రయోగములను <u>''పాదపా – మదపపా''</u> ప్రయోగములలో ధైవతమును ధైవతమును కొద్దిగా నొక్కిన యెడల శుద్ధధైవతముకన్నా తీవ్రముగా పలుకుటకు అవకాశము గలదు. ఇదే విధముగా '<u>పదపనీస</u>' ప్రయోగములో చతుశ్శ్రుతిధైవతము ఇంకా తీవ్రమగుచున్నది.

ఈ ప్రత్యేకమైన ప్రయోగములలో తప్ప మిగిలిన ప్రయోగాలలో 'సనిదప'

అను వెకరాల ప్రయోగములలో చతుశ్శ్రుతిధైవతము పలుకుచున్నది.

'సనిదప' ప్రయోగములో ధైవతము నిషాదము యొక్క అనుస్వరములో

'సానిసానిప' అని పలుకుచున్నది.

పదము - పల్లవి :- ; గపమపా, । పా ; । పాపా ।।
; శ్రీ—ప— । తి — । సుతు ।।
పమగపమపాదప। నిపాగు । మాపమ గరి ।।
-- బారి- - । కి - - । నే - - --।।

గా గా గా,మ ప మ । మా; । మ ని పా ప మ ।।
- నో ప - - - । లే - । క - - - - ।।

మా మమమా మగగరి । గా,గమమ । మా ; ।।
ని సు - - వే -- । డి --- । తే - ।।

మా గా గా,మ పమ । మా ; । మనిపా ప మ ।।
కో పా - --। లా - । మా - - ।।
మమమా గ రి గా ; । మమమా గ రి । రిగారి సా ।।
ము - - - - - । మ్మ-- - - । -- - ।।
సా న్ సా మా । మ గ రీ । రి గా రి సా ।।
- గో పా - । ల - - । - - - - ।।

2. , గ మ పానిపా ప సి । సిసనిద ని ద । పా,ని నిపామా ।। పా ।। శ్రీ
- శ్రీ - ప-- - - । తి- -- సు- । తు - --- ।। - ।।

చరణం - ; గ మ పా ; | పా , | పా పా | | ప మ గ మ పా ద ప |

- ఏ - పో - | ద్దు - | దా - | | - - నిం - దీ - - |

మపామ | మాపమ గ రి ||

క - - | నే - - - - ||

గా గా గా, మపమ | మా , . | మనిపా ప మ ||

- రా ష్ట్ర - - - | యుం - | డి - - - - ||

సా మపమా మ గ గ రి | గా,మ ప మ | మా ; ||

నీ వ - - ర - - - | స - - - | స - ||

మా గా* గా*,మ ప మ | మా; | మనిపా ప మ ||

- ల్లా పా - - - | లా - | వా - - ||

మపమా గ రి గా , | మపమా గ రి | రిగారి సా ||

న ను - - - - న్న - | గో - - - | - - - - ||

సాన్ని సా మా | మ గ రి | రిగారి సా ||

గో పా - | ల - - | - - - - || ||శ్రీ||

<u>సాహిత్యమునందు భావాభినయము:-</u> శ్రీపతి సుతుబారికు నేను ఓపలేక నిన్ను నేడితే గోపాల మువ్వగోపాలా అనునపుడు ఇందు నాయిక —

<u>ఆహార్యము:-</u>

1. పసుపు పచ్చని చీర, రవికె.
2. మేలిమి బంగారు కాంతితో మెఱయుచున్న జరీలంగా కురులు నున్నగ దువ్వి జారుముడి. అందు చేమంతుల అలంకారము, పాపిడబిందు.
3. కనులకు సన్నగా కాటుక, రెప్పల వెంట్రుకలు నల్లగా ఉండి రెప్పలు [illegible]గా మాత పడుచుండవలెను.
4. కొంచెము మొక్క బెట్టిన విల్లువంటి అధరము.

సాత్త్వికాభినయము:- 1. మోహము — వియోగము, సంతోషముతో కూడిన బాధచేత నిర్ణయించుట లేక హృదయము ఆందోళనచెందుట.

నిమీలిత నేత్రములు శరీరము మరచుట.

అర్ధనిమీలిత నేత్రములు కన్నులు మూతబడుట.

శరీరము కంపించుట క్రిందికి ఒరగుట.

చెమర్చుట, అధరము వణకుట చేష్టలు లేవు.

2. హర్షము, మదము:- ముఖము నేత్రములందు వికాసము.

శరీరముప్పొంగుట.

శరీరము గగుర్పొడుచుట.

పులకరింపు.

3. దైన్యము:- ముఖమందు, నేత్రములందు వికాసము.

శరీరము కుంచుకొనుట.

వేడుకొనుట.

అశ్రుపూరిత నేత్రములు.

4. ఔత్సుక్యము:- క్షణమాత్రము కూడ ఓర్వలేక త్వరపడుట.

కోరిన వస్తువు లభింపక క్షణమైన

తాళలేక పోవుట.

మన్మథతాపము —— తొందరపాటు —— పడకనుండి లేచుట.

నిట్టూర్పు —— వేగముగనడచుట —— శరీరముబరువెక్కుట.

మనస్సు కలత చెందుట — శంకించుట —— చింతించుట.

తాళలేక పోవుట —— ఎదురుచూపులు

5. నిర్వేదం:- కన్నీటి సడ్డగించుట.

6. ఆవేగము: - ((అగ్నావేగము)).

విసరు కొనుట.

చెమట బిందువులు తుడుచుకొనుట.

నేత్ర సంకోచము.

పశ్చాత్తాపముగ అడుగులు వేయుట.

7. ఖేదము: - చేతులు విసురుకొనుచూ ఊయుననటు తిరుగుట, ముఖము విచారము బొందినట్లు కనబరచుట.

చింత ((బ్రహ్మనొందుగా)).

అంగికాభినయము: - శ్రీపతి సుతు వారికి

1. అలుగు విల్లుడు
2. కమ్మవిల్లుడు
3. రా చిల్కనెక్కుడు రాయర్నెతు
4. మీనకేతనుడు
5. మకరకేతనుడు
6. చందమామ అల్లుడు.
7. మలగాజు.
8. అంగవిహీనుడు.
9. లచ్చికొమరుడు ((లక్ష్మీపుత్రుడు))
10. జిమిలి ముక్కాలి నారివిలుకాడు.

శ్రీపతి సుతువారికి: - బాణ హస్తము పట్టి సంధించి తరువాత రెండు చేతులందుండు కటకాముఖ హస్తములు పట్టి, వానిని హృదయము వద్దకు తెచ్చిన బాణము తగిలినట్లు భావము - అట్లే చేతుల అల పద్మములు ఆరవేతుల్లు ... పట్టి వేళ్ళ మణికించిన ''నేనోపలేక'' అనుటకు చెల్లును.

'' నిను వేడితే '' —

రెండుచేతులందు ముకుళములు పట్టి, కుడిప్రక్కకుగాని, ఎడమ ప్రక్కకు గాని పొడిగించి, జాలిచూపుల జూచుచు హాస్యము వికసింపవలెను.

గోపాలా? ముద్దుగోపాలా? (సాత్విక సహాయముతో)

ఎడమచేత స్వాపంయమున కెదురుగ అలపద్మము పట్టి, కుడిచేతి సూచిముఖము పట్టి తలక్రిందుకి చేయిఎత్తి కొంచెముగ త్రిప్పిన ఊరునకు జెల్లును.

"గోపాల! — వేణువు జూపవచ్చు. లేక ఎడమచేత సింహాముఖము కుడిచేత సూచి గోవులను తోలుటకు పట్టుట.

2. "ఏపొద్దు దాసింటిలోనే కాన్పై యుండి నీ సరస సల్లాపాలా?

అనుగ్రహము అసూయ ఉగ్రత వితర్కము

ముద్దుగోపాలా? (ఇందు అసూయకు ప్రాముఖ్యము).

1. అమర్షము, రోషము, అసూయ.

1. చింతించుచుండుట.
2. దెప్పుచుండుట.
3. వెమర్చుట.
4. శిరఃకంపనము.
5. తలవంచుట.
6. తర్జన భర్జన.

1. మోము త్రిప్పుకొనుట.
2. కనుబొమ్మలు, ముఖములేక నోసలు చిట్లించుట.
3. అధిక కోపముచేతగాని, ఓర్వ లేకగాని నిస్సహాయత్వము వలన గాని కంటతడి పెట్టుట.

3. ఉగ్రత:- కన్నులెర్రబడుట.

వితర్కనము:- కనుబొమలు నెత్తుట, ఎగరవేయుట, తలనుముందుకు ఆడించుట, ఆలోచింపుచున్నట్లు కనబరచుట.

సరస సల్లాపములు:-
1. కులుకు గుబ్బలు చూపుచుని కులుకుట.
2. తలయూచి నవ్వుట.
3. తాళజాలనని వేడుట.
4. వలరాజునకై పదము పాడుకొనుట.
5. నిను బాసిన కంటికి నిదుర రాదనుట.
6. నివసవన్నైన గాని పోదన్నపోదు.
7. పరుబారి కోరవగరాదు.
8. కామశాస్త్రము చదివి కథలు చెప్పుమనుట.

ఆంగికము:- ఏ పోడు — కుడిచేత పతాకము ముఖము, ముందునుండి క్రిందికి తీసికొని రావలెను.

'దానికింద్రిలోన కాళ్ళై యుండు' (వెటికలు విరుచుట) రెండుచేతులయందు పతాకము తలపై చేర్చి గోపురాకారముగ పట్టవలెను. (ముఖ శీర్షము ముందునుండి క్రిందికి తీసుకొని రావలెను.).

నీ సరస సల్లాపాలు:- కుడిచేత అలపద్మముపట్టి తలను చేతిని ప్రక్కల కాడించుచు అడిగినట్లు గడ్డముక్రింద యెడమ చేయినుంచి బొమ్మముడి, ఎడమచేయి నడుమున్నైనుంచి, కుడిచేయి జారవిడచి తలముందు వెనుకలకు ఆడించుట.

3. పై ప్రాసపదాల నేర్పు జూపు — దాని రతిపై ఇంత తీపేలా ముద్దుగోపాలా?

అపహాస్యము ఉగ్రత రతులు అసూయ వితర్కము.
(ఇందు వితర్కము ప్రధానము).

<u>అంగీకము:-</u> (పై పూతపూటల నేర్పు).

ఎడమ చేత ముకుళము పట్టి, కుడిచేత చతురముతో దానిపై వ్రాసి సన్నిసంయించి, తరువాత కటికాముఖమును నాభివద్ద నుండి నోటి వద్దకు తెచ్చి, ఆపైన్నె కుడిచేత శిఖరము పట్టవలెను.

చూపు —— దృష్టి భేదము.

దాని —— మెటికలు విరచునట్లు, దూషించునట్లు.

రతిపై —— రతులు.

1. ఎడమ చేత పతాకమును పట్టి — చెక్కిళ్ళకు తగులునట్లుంచి కుడిచేయి జారవిడచి నడక నభినయించి — కుడిచేత కర్తరీముఖములో చూపుడు, నడిమివేళ్ళు కలుపవలెను. ఇటుల సమయానుకూలముగ హస్తములనేర్పరచుకొని అభినయించుట.

<u>ఇంకొకప్రకారము:-</u> తీపేలా శిఖరము పట్టి ముందు వెనుకలకు పావురాయి వలె తల నాడించుట.

4. చూపుల సన్నల తేరి చూడని నాతోలేని కలాపాలా ముద్దుగోపాలా?

గర్వము బేధము రోషము (భేదమునకు ప్రాముఖ్యము).

5. నాపాలిందెల్ల దానికబ్బె — యేపొందులేక ఉసూరనుట.

ఖేదము  అమర్షము  నిర్వేదము

నిర్వేదము  అసూయ

నాపాలా?  మువ్వగోపాలా?

ద్వేషము  వితర్కము.

ఇందు ద్వేషము, వితర్కము, ఖేదము, అసూయ నాలిగించిని విజృంభించి అభినయించి ముగించవలెను. ఇందుగల సాహిత్యమునకు సంగీతమునకు రెండింటికి నేళనించి అభినయము చేయవలెను.

0000000000

# ముగింపు

<u>సమాహార పదరచన :-</u> క్షేత్రయ్య సకలవిధాలా సముజ్జ్వలమైన పదరచనలో పూర్తిగా సంభాషణ సౌష్ఠవాన్ని చూపించగల దిట్ట. ఇందుకే పదమైనా ఉదాహరణమవుతుంది.

"పల్లవి: మగువ తన కేళికామందిరము వెడలెన్

నగతాడవో కంచి – వరద! తెల్లవారెననుచు ।।మగువ।।

విడిబాణము గొజ్జంగి–చిరికొండజడతోను

సడలిక పడివెనగు–కుంకుమరితోను

నిడుదకన్నులదేరు–నిదుర మబ్బులతోను

తొడకి పదములాపుచు–తడబడెడు నడకతోను ।।మగువ।।

సొగసి సొగంపుని వలపు–సోరింపు జాపులతోను

సగసగల ఘనసార–వాసనలతోను

జిగిమించు కెమ్మోవి–చిగురు కెంపులతోను

సగముడుగ చెమటలూరి దిందు–చందనములతోను ।।మగువ।।

చరిత్పు సేయు సమ సురత బడలికతోను

జిరుతపారడ చెంగు–జారెల్లటతోను

జిగువాడలక్కెదండ–బిచ్చు తరుణులతోను

పరమాత్మ! మువ్వగోపాల! తెల్లవారెననుచు ।।మగువ।।

ఈ పద రచనతో క్షేత్రయ్య అమరుడయ్యాడు. ఇది అతని కీర్తికి జయపతాక! రసజ్ఞులైన వారి కిందలి రస భావాలు అనుభవైకవేద్యాలు. పల్లవిలోని భావం నాయిక తన కేళికా మందిరం – ఏకాంత మందిరంనుంచి వెడలిపోవడం.

అనుపల్లవిలోని భావంతో పదంలోని ప్రధాన భావం పూర్తిగా వ్యక్తమవుతుంది. తక్కిన మూడు చరణాల్లోను నాయిక బాహ్యాంతరాల భావాలన్నీ స్పష్టమవుతాయి. గత రాత్రి ఏకాంత మందిరంలోకి వెళ్ళుతూ జడలో తురుముకొన్న గొజ్జంగి విరిసండ' విడజారిపోయాంగి. 'కంటసరి' చిక్కువడి వెనగులాడుతుంది. విశాలనేత్రాల్లో రాత్రి మేల్కొనడంవల్ల - తెల్లవారినా నిదురమబ్బు స్ఫుటంగా కనిపిస్తుంది. దానిలో జలసట, అలసటచే తడబడు నడకలు, పరవశత్వం, పరిపూర్ణత్వం పొందీ పొందని వలపుచూపుల సొంపులతోను, కర్పూరపు పరిమళాలతోను, కెమ్మోవి చిగురు కెంపులకాంతులతోను, నాయకుడుంచిన నఖక్షతాలతోడి సగం మాత్రమే కని పించే స్తనద్వయంతోను నాయిక కేళికా మందిరం వెడలివచ్చింది. అంతేకాదు. తరితీపులు కలిగించే సమసురత' వల్ల బడలిక కలిగింది. అది స్పష్టంగా తెలు స్తుంది. ఆ బడలికవల్ల జారిపోవు ష్టైటస్సైతం సవరించుకోవడం లేదు. అండ దండలుగా చెలికత్తెలు ఇరుగడల ఉన్నారు. కాబట్టి సరిపోయింది. ''అయ్యో ! పరమాత్మ! తెల్లవారిపోయింది'' అంటూ నాయిక తన కేళికా మందిరం వెడలి వచ్చిందట. ఇది నాయికా పరిపూర్ణ పరవశత్వానికి పరమోదాహరణ. అమ్మ వారు, అయ్యవారు వేంచేపు చేయించాక రాత్రి జరిపిన సగత క్రీడా చిహ్నాలు ఈ పదంలో వర్ణితం. ఇది భగవత్పరకమైంది. నాయిక తానే అంటు వర్ణించాడు. మధుర భక్తి భావంతో క్షేత్రయ్య. ఈ పదములో 'విడజారు', చిక్కుముడి వెనగు, నిదురమబ్బు, తడబడెడనడ, సోగసి సోగయని వలపుసొంపు, వగవగలు విదింప దండరలు, తరితీపునేము, మొదలైనవన్నీ సాభిప్రాయపదాలు. ఇలాంటి పదప్రయోగంతో అందె వేసిన చేయి క్షేత్రయ్య అయా పదాలు భావస్ఫూర్తితో రసాస్వాదనకు అనుకూలిస్తాయి.

రసభావాలు సహృదయ హృదయైకవేద్యం. మరి ఈ పదం' వాక్యం ...

రసాత్మకం కావ్యమ్." రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అన్న సిద్ధాంతాలకు సరిగ్గా సరిపోతుంది. కాబట్టియేమో ఒక చిత్రకారుడు మనోజ్ఞ వర్ణచిత్రం చిత్రించవచ్చు. శిల్పి శిల్పంగా చెక్కవచ్చు. కాని నిదుర కన్నుల దేరు నిదుర మబ్బులోను నిగనిగల ఘనసార వాసనలను వెదజల్లే పద్ధతిన్ చిత్రించడం చెక్కడం కష్టసాధ్యం. 'నిదుర కన్నుల దేరు నిదుర మబ్బున్నా' చిత్రించి, చెక్కవచ్చునేమో గాని, నిగనిగల ఘనసార వాసనలను చిత్రంలోను, శిల్పంలోను చూపడం ... సాధ్యమైన పనికాదు. అభినయంలో నర్తకి నిదుర కన్నుల నిదుర మబ్బును ప్రకటించవచ్చునేమోగాని, ఘనసారవాసనలను వెదజల్లడం కష్టమే. సంగీతంలో నృత్యం ఇది సాధించడం సులభం కాదు. కాని భావనైకలోకంలో భావుకుడు వీటిన్నింటిని భావించి ఆనందించగలడు. అదే కవి నేర్పు. కవితా కళలోని సొగసు, బంగారంగ సౌందర్య వర్ణనగల ప్రబంధ కవుల వర్ణనలకంటే క్షేత్రయ్య నాయికావర్ణన ఎన్నో రెట్లు గొప్పది. ఇది చలత్సౌందర్య వర్ణన. ఇందులో పద లాలిత్యం, భావాల సొగసులు ఉన్నాయి. ఇక్షేపదం ఎన్ని విధాల చూచినా క్షేత్రయ్య పద కవితా శిల్పానికి పరమోదాహరణమైనది ఒప్పుతూంది. 'రసవిద్యాః కవీశ్వరాః' అన్న సూక్తికి నిదర్శనం క్షేత్రయ్య.

ooooooooooo